# చందమామ కేమెల్

## రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు



బహుమతులు గెలుచుకోండి
1 మెడల్ — మొదటి బహుమతి రు. 15
1 మెడల్ — 2వ బహుమతి రు. 10
1 మెడల్ — 3వ బహుమతి రు. 5
1 మెడల్ — 5 కన్సొలేషన్ బహుమతులు
1 మెడల్ — 10 సర్టిఫికెట్లు

చుక్కల గీత వెంట కత్తిరించండి.

12 సంవత్సరములు లోపు వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగులతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రెసుకు పంపండి.
P.B. No. 9928, COLABA, Bombay 400 005.
ఫలితములు తుది నిర్ణయముగాను, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________________ Age ____________

Address ______________________________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

VISION

**CONTEST NO 20**

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.
ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. 31-7-1981




## ఇదిగో!
## పెప్పర్‌మెంట్ రుచి కలిగిన ఒక చాక్‌లెట్ బిస్కట్

# స్క్రంచ్

## కరకర తినే చక్కని తినుబండారం

భారతదేశంలో ఈ రకం రెండు రుచుల తియ్యని తినుబండారం ఇదే మొదటిసారి—చాక్‌లెట్ మరియు మింట్ కలిసినది, మృదువయినది, రుచికరమైనది, ఎక్కువ చాక్‌లెట్ క్రీమ్‌తో వున్నది—గోధుమవన్నె గల కరకరలాడే రెండు అందమైన బిస్కట్ల మధ్యవున్న పెప్పర్‌మెంట్ రుచిగల చాక్‌లెట్. ఇటువంటి దానిని మీరు యింతవరకు ఎప్పుడు రుచి చూడలేదు. అప్పుడే ఒక్క ప్యాకెట్ బిస్కట్ తీసుకోండి. కరకర నములుతూ తినండి. స్క్రంచ్...స్క్రంచ్...స్క్రంచ్...





## స్క్రంచ్ కరకర తినే చక్కని తినుబండారం

ట్రూ బిస్కట్లు తయారుచేసేవారు అందచేస్తున్న సరిక్రొత్త తినుబండారం

HTM-AFL-2345

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["ఆదర్శప్రభువు"] కు ఆధారం, గంగిశెట్టి శివకుమార్ రచన.

పూజలూ, పుణ్యకార్యాలంటే ఆసక్తి వున్నట్టు పైకి నటిస్తూ, ఏ అడ్డదారులైనా సరే తొక్కి ధనం సంపాయించచూసే వ్యక్తులు, ఎలాంటి చిక్కులపాలవుతారో, "గ్రహణస్నానం" అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

బుద్ధేర్బుద్ధిమతాం లోకే, నాస్త్యగమ్యం హి కించన,
బుద్ధ్యాహతా యతో నందాః, చాణక్యే నాసిపాణినా.

[నిశితమైన బుద్ధిబలం గలవారికి లోకంలో సాధ్యం కాని దంటూ ఏమీలేదు. గొప్ప ఆయుధబలం గల నందులను, చాణక్యుడు తన బుద్ధిబలంతోనే గదా జయించాడు!

సంపుటి 69 జూలై '81 సంచిక 1

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00








# మాటపట్టింపు

వీధి కుక్కల అరుపులకు జానకయ్యకు మెలుకువ వచ్చింది. అప్పటికి అర్ధరాత్రి దాటి వుంటుంది. ఎందుకైనా మంచిదని జానకయ్య తలుపులు తీసుకుని యివతలకి వచ్చాడు. చీకటిగా వున్న వీధిలో, గాడిదను చూసి కుక్కలు మొరుగుతున్నవి. అవతల చలి విపరీతంగా వుంది. అతడు కుక్కలను అదిలించి, లోపలికి రాబోతూ, అరుగు మీద ఎవరో ముడిచి పెట్టుకుని పడుకుని వుండడం చూశాడు.

''ఎవరు వారు?'' అన్నాడు జానకయ్య.

ఆ వైపు నుంచి జవాబు లేదు. జానకయ్య ఆ మనిషిని తట్టి చూశాడు. అతను చలికి గడగడలాడి పోతున్నాడు; ఒళ్ళు జ్వరంతో కాలిపోతున్నది.

''చలి ఎక్కువగా వుంది. ఒంట్లో బా వున్నట్టు లేదు. లోపలికి వచ్చి పడుకో,'' అన్నాడు జానకయ్య.

అతను అతి కష్టం మీద లేచి, జానకయ్యకు చేతులు జోడించాడు. జానకయ్య అతడికి చేతి ఆసరా యిచ్చి, లోపలికి తీసుకువెళ్ళాడు. తరవాత చాప పరిచి, కంబళి కప్పి పడుకోబెట్టాడు. ఆ మనిషి మరుక్షణం నిద్రలోకి జారుకున్నాడు. అతన్ని గురించిన ఆలోచనలతో, జానకయ్యకు చాలా సేపటివరకూ నిద్రపట్టలేదు.

ఎవరో తలుపు దడదడ బాదుతూండగా అతడికి మెలుకువ వచ్చింది. ఆ సరికే బారెడు పొద్దెక్కింది. ఆ వచ్చింది అతడి భార్య, రత్నం. ఆమె, ఆ క్రితం రాత్రి అదే ఊళ్ళో బంధువుల పెళ్ళికి హాజరయి, తెల్లవారుతూనే ఇంటికి వచ్చింది.

''ఇంత పొద్దెక్కే దాకా పడుకున్నావేం?'' అంటూ లోపలికి వచ్చిన ఆమె, చాప మీద కంబళి కప్పుకుని పడు

పూచిరాజు కామేశ్వరరావు

కుని వున్న మనిషిని చూసి, "ఎవరో వచ్చినట్టున్నారే! ఎవరు?" అని భర్తను అడిగింది.

"ఏమో, ఎవరో!" అని జానకయ్య జరిగిందంతా చెప్పాడు.

"అయ్యో పాపం! వేడి పాలిస్తే కాస్త తేరుకుంటాడు. మీరు అతన్ని లేపి మొహం కడుక్కోమని చెప్పండి," అంటూ ఆమె హడావిడిగా వంట గదిలోకి వెళ్ళిపోయింది.



జానకయ్య ఆ మనిషిని లేపుదామని ఒంటి మీద చెయ్యి వేసి, ఉలిక్కి పడ్డాడు. రాత్రి నిప్పులా కాలిన అతని ఒళ్ళు యిప్పుడు, మంచులా చల్లగా వున్నది.

"ఇతను పోయాడే!" అంటూ జానకయ్య ఒక వెర్రికేక పెట్టాడు.

వంట గదిలోంచి రత్నం పరుగు, పరుగున వచ్చి, "పోయాడా అయ్యో! ఇప్పుడేం చేద్దాం? అతని ఊరు ఏదో, అతని వాళ్ళు ఎక్కడ వున్నారో!" అంటూ లబలబలాడింది.

జానకయ్య ఆ మనిషి నడుం తడిమి చూశాడు. చేతికి గలగలలాడుతూ డబ్బు సంచీ తగిలింది. అతను ఆ సంచీ పైకి తీసి, కింద గుమ్మరించాడు. డబ్బుతో పాటు, ఒక ఉత్తరం కూడా కింద పడింది. అది, ఒక తల్లి కొడుక్కు రాసిన ఉత్తరం. అందులో యిలా వున్నది:

"బాబూ, నారాయణా! నీకీ మధ్య జ్వరం కాస్తున్నదని, మన ఊరు మనిషి ఒకరు బజార్లో కనిపించి చెప్పాడు. ఇప్పుడు ఎలా వున్నది? ఇక్కడ నీ తమ్ముడి పరిస్థితి బాగాలేదు. కూతురు పెళ్ళికి మూడువేల రూపాయలు ఎలా తేగలనా అని, వాడి బెంగ. చాలా మంచి సంబంధం. ఈ సమయంలో మీరు పాత స్పర్థలూ, మాటపట్టింపులూ మర్చిపోవాలి. రాధ పెళ్ళికి నువ్వు డబ్బు సాయం చేయాలి. పెద్దవాడివి కనక, తమ్ముడి విషయంలో నువ్వే సర్దుకు పోవాలి.



ఈ ఉత్తరం అందగానే ఒంట్లో బావుంటే డబ్బు తీసుకుని బయలుదేరు. ఇక్కడ మేం మరో ఇంటికి మారాం. కొత్త చిరునామా రాస్తున్నాను. ఈ ఉత్తరం వెంట తెచ్చుకుంటే, ఇల్లు తేలిగ్గా కనుక్కోవచ్చు.''

జానకయ్యకు సంగతి అర్థమైపోయింది. అతడు భార్యతో, ''పాపం, తమ్ముడి కూతురు పెళ్ళికి డబ్బు తీసుకుని బయలుదేరి, దారిలో పోయాడు. ఈ ఉత్తరం వెంట వుంచుకోవడం మేలే అయింది! మనకు కనీసం, ఆ తమ్ముడి చిరునామా అయినా తెలిసింది,'' అన్నాడు.

''మీరు వెంటనే బయలుదేరి ఆ ఊరు వెళ్ళండి. వాళ్ళకు ఉత్తరం, డబ్బూ యిచ్చేసి, సంగతి చెప్పి తీసుకురండి. మీరు వచ్చేదాకా నేను పెళ్ళివారి ఇంట్లోనే వుంటాను. ఇంటికి తాళం పెడదాం,'' అన్నది రత్నం.

అప్పటికప్పుడు భార్యాభర్తలు యింటికి తాళం పెట్టారు. జానకయ్య బాడుగ బండిలో రెండామడల దూరంలో వున్న నారాయణ తమ్ముడి ఊరికి బయలుదేరాడు. అతను ఆ ఊరు చేరేసరికి మధ్యాహ్నం అయింది. అతడికి ఇల్లు కనుక్కోవడం కష్టమేం కాలేదు. కాని లోపలికి వెళ్ళబోతున్న అతను, లోపలి నుంచి వచ్చే మాటలు విని, గుమ్మంలోనే ఆగిపోయాడు.

''అమ్మా! డబ్బెక్కడా దొరకలేదు. ఇక నేను చేయగలిగిందేమీ లేదు. పెళ్ళివారికి మరో సంబంధం చూసుకోమని చెప్పేస్తాను,'' అంటున్నారు ఎవరో, బహుశా, తమ్ముడు కాబోలు!

''అదేం మాటరా! చక్కటి సంబంధం, డబ్బుకు వెనకాడి వదులుకుంటామా? మీ అన్నయ్యకు డబ్బు తెమ్మని ఉత్తరం రాశాను. తప్పకుండా డబ్బు తెస్తాడు,'' అంటున్నది తల్లి.

ఆ మాటకు తమ్ముడు పెద్ద గొంతుతో, ''నాకు చెప్పకుండా ఉత్తరం ఎందుకు రాశావు? అన్నయ్య డబ్బు చచ్చినా నేను

ముట్టను. ఆ డబ్బుతో నా కూతురి పెళ్ళి చేసేది లేదు,'' అన్నాడు.

''చిన్న మాటపట్టింపుతో, మీ అన్న దమ్ములు పదేళ్ళుగా మొహాలు చూసుకో లేదు. రాధ పెళ్ళిలో అయినా మీరు కలుసుకుంటారని యిన్నాళ్ళుగా ఆశ పడ్డాను,'' అన్నది తల్లి బొంగురుపోయిన గొంతుతో.

జానకయ్య తలుపు చప్పుడు చేసి, ''నారాయణ తమ్ముడు గారి ఇల్లు యిదేనా?'' అని కేకపెట్టాడు.

లోపలినుంచి నలభై ఏళ్ళ మనిషి తలుపు తెరిచి, ''ఎవరు మీరు? లోపలికి రండి?'' అన్నాడు ఆశ్చర్యపోతూ.

జానకయ్య లోపలికి వెళ్ళి కుర్చీలో కూర్చుని, డబ్బుసంచీ బల్లమీద పెట్టి, ఉత్తరం తమ్ముడు చేతికి యిచ్చాడు. తమ్ముడు ఆ ఉత్తరం చదివి, ''ఇది, మా అమ్మ అన్నయ్యకు రాసింది. తను రావడానికి మొహం చెల్లక, అన్నయ్య డబ్బు పంపివుంటాడు. ముందు ఆ డబ్బు సంచీ, నా కళ్ళముందు నుంచి తీసే యండి!'' అన్నాడు జేవురించిన మొహంతో.

''మీ అన్నయ్య స్వయంగా వద్దామను కున్నాడు; కాని రాలేకపోయాడు. మీరిద్దరూ కలుసుకోవడం మరి యీ



జన్మలో జరగదు,'' అంటూ జరిగిన దంతా చెప్పేశాడు జానకయ్య.

తల్లి ఘొల్లుమన్నది. ఒక క్షణం ఆగి తమ్ముడు అరచేతుల్లో మొహం దాచుకుని, ''అన్నయ్యా, నన్ను క్షమించు!'' అంటూ ఏడ్వసాగాడు.

ఆ ఏడుపు చూసి జానకయ్య ఏమాత్రం జాలిపడకుండా, ''బతికున్న మనిషి విలువ తెలుసుకోవటం కష్టం. నీ మీద నీ అన్నకు ఎంత ప్రేమ లేకపోతే, ఒంట్లో బావుండకపోయినా, డబ్బు తీసుకుని బయలుదేరుతాడు? నువ్వు సోదరప్రేమకు యిన్నాళ్ళూ దూరం అయావు. ఇప్పుడది కోరినా దొరకదు,'' అన్నాడు.

ఆ ఇంట శోకాలు విని ఇరుగు పొరుగు ఇళ్ళవాళ్ళు వచ్చారు. అంతలో, "ఏమిటి దంతా? ఏం జరిగింది?" అంటూ ఒక ఏభై ఏళ్ళ మనిషి అక్కడికొచ్చాడు.

అతణ్ణి చూస్తూనే తల్లీ, తమ్ముడూ ఏడుపుమాని నిర్ఘాంతపోయారు. తమ్ముడు అతణ్ణి సమీపిస్తూ, "అన్నయ్యా, నువ్వు బతికే వున్నావా! నేను మూర్ఖుణ్ణి, నీ మంచి గుణం తెలుసుకోలేకపోయాను," అంటూ కాళ్ళు పట్టుకున్నాడు.

జానకయ్యకు ఆ వచ్చిన మనిషి తామింతవరకూ చచ్చిపోయాడనుకునే నారాయణ అని అర్థమైపోయింది.

సంగతంతా తెలుసుకుని నారాయణ నవ్వి, "నేను డబ్బు తీసుకుని మొన్ననే బయలుదేరాను. రాధకు పట్టుచీర కొందామని పట్నం బజారుకు వెళ్ళాను. అక్కడ ఒక ముసలాడు, దిక్కులేనివాణ్ణి, బిచ్చం అంటూ వెంటపడ్డాడు. జాలిపడి డబ్బు మూటపైకి తీసి, వాడికి ఒక రూపాయి యిచ్చాను. నేను దుకాణంలో చీరలు చూస్తుండగా, వాడు నా వెనకే తచ్చాడుతూండడం, నాకు అనుమానం కలిగించింది. తీరా చీర తీసుకొని, డబ్బు కోసం చూసేసరికి, మొలలో దాచిన డబ్బు సంచీ లేదు. ముసలాడి కోసం తెగ వెతికాను. వాడు కనిపించలేదు. మళ్లీ ఇంటికి వెళ్ళి డబ్బు తీసుకుని, బయలుదేరి యిక్కడికి వచ్చాను. మీ ఇంట్లో చచ్చిపోయింది, దొంగే అయుంటాడు," అన్నాడు జానకయ్యతో.

"ఆ దొంగ చచ్చి మేలు చేశాడు. అతడి పుణ్యమా అని, అన్నదమ్ములు మళ్ళీ కలుసుకున్నారు," అన్నది తల్లి సంతోషంగా.

"ఇక నేను వెళతాను. ఇంటివద్ద జరగవలసిన పని చూడాలి," అంటూ జానకయ్య లేచాడు.

"వచ్చే నెల మా అమ్మాయి పెళ్ళి. మీ ఇంటిల్లిపాదీ తప్పకుండా రావాలి," అంటూ, అన్నదమ్ములిద్దరూ జానకయ్యకు వీడ్కోలు చెప్పారు.






## 15

[శివదత్తుణ్ణి వెతుక్కుంటూ బయలుదేరిన సమరసేనుడు, ఒక నీటిమడుగు వద్ద మొసలి వాతబడనున్న తన సైనికులను కాపాడాడు. వాళ్ళద్వారా అతడికి వ్యాఘ్రదత్తుడు ఎటు వెళ్ళి నదీ తెలిసింది. ఆ సమయంలో అతడికి చెట్టునుంచి వేళ్ళాడుతున్న పత్రం ఒకటి దొరికింది. హఠాత్తుగా కొండపై నుంచి కొందరు సైనికులు అతడికేసి బాణాలు వదలసాగారు. తరవాత—]

సమరసేనుడికి తమపై బాణాలు వదులు తున్న వాళ్ళెవరై నదీ తెలుసుకునేందుకు ఆట్టేకాలం పట్టలేదు. "వ్యాఘ్రదత్తుడికీ, జై! వ్యాఘ్రమండలానికీ, జై!" అన్న వాళ్ళ కేకలూ, అరుపులూ కొండగుహలు ప్రతిధ్వనించేలా వినబడుతున్నవి.

"వీళ్ళు వ్యాఘ్రదత్తుడి భటులు! వాళ్ళకు మనం వున్నచోటు తెలిసిపోయింది. జాగ్రత్త, మనను చుట్టుముట్టి హతమార్చాలని చూస్తున్నారు," అని సమరసేనుడు తన సైనికులను హెచ్చరించాడు.

వ్యాఘ్రదత్తుడి భటులు కొండరాళ్ళ వెనక పొంచి వుండి, సమరసేనుడి పైనా, అతడి అనుచరుల పైనా బాణాలు ప్రయోగిస్తూ, క్రమంగా ముందుకు రాసాగారు. ఇలాంటి చిక్కునుంచి ప్రాణాలతో బయట పడాలంటే, సమరసేనుడికి




ఒక్కటే మార్గం కనబడింది—రాళ్ళ చాటున దాక్కుంటూ, ఆ ప్రదేశం వదిలి పోవడం!

సమరసేనుడితో పాటు సైనికులు కూడా నిశ్శబ్దంగా రాళ్ళ వెనక నక్కుతూ ఎదురుగా వున్న సొరంగం కేసి పాక సాగారు. ఆ సొరంగం ఎక్కడికి దారి తీస్తుందో, అవతల ఏమున్నదో అన్న సంశయం వాళ్ళను అంతగా బాధించ లేదు. ముందు వ్యాఘ్రదత్తుడి వలనుంచి బయట పడడం ముఖ్యంగా కనబడింది వాళ్ళకు.

చివరకు అందరూ సురక్షితంగా ఒక చీకటిగుహ చేరారు. వ్యాఘ్రదత్తుడి భటుల అరుపులూ, కేకలూ క్రమంగా తగ్గిపోసాగినై. వాళ్ళు తమను వెతుకుతూ మరొక మార్గాన పోయి వుంటారని, సమర సేనుడు ఊహించాడు.

అప్పటికి బాగా పొద్దెక్కి సరిగా మిట్ట మధ్యాహ్నమయింది. సమరసేనుడు చీకటిగావున్న గుహలో తడుముకుంటూ కొంచెం ముందుకు సాగాడు. అతడికి ఆ రెండవకొస నుంచి సన్నని సూర్య కాంతి కనిపించింది. మరికొంత ముందుకు నడిచి గుహకు అవలివైపు చేరాడు.

అక్కడ కంటబడిన దృశ్యం సమర సేనుణ్ణి చాలా ఆశ్చర్య పరిచింది. ఎట్ట ఎదుట శివదత్తుడు పటంలో గుర్తు సూచించిన శిథిలాలు! ఏదో ఒక మహా నగరం భూకంపం వల్ల సర్వనాశనం అయినట్టు, పెద్దపెద్ద భవనాలు, గోడలు చెల్లాచెదురుగా విరిగి పడిఉన్నవి. రాతి స్తంభాలుకొన్ని సగం విరిగిపోయినస్థితిలో, ఏ క్షణంలో అయినా కూలిపోయేలా కనిపించినై.

ఇది శివదత్తుడు పటంలో రాసిన శిథిల నగరం అనేందుకు సందేహం లేదు. శివదత్తుడు యిందులోనే దాక్కొని వుంటాడు! కనక, తను ధైర్యం చేసి ముందుకు వెళ్ళడమే మంచిదను కున్నాడు, సమరసేనుడు. అతడి వెంట

వున్న సైనికులు శిధిలనగరంకేసి చూస్తూ, అద్భుతపడిపోతున్నారు.

ఇక వున్నచోటునుంచి కదిలి, శిధిలాల లోకి పోదామని సమరసేనుడు బయలు దేరబోయేంతలో, ఆ ప్రదేశమంతా దద్దరిల్లే టట్టు శంఖనాదాలూ, కేకలూ వినిపించినై. మరుక్షణం యాభై, అరవైమంది భటు లతో వ్యాఘ్రదత్తుడు, ఆ శిథిల భవనాల మార్గాన వస్తున్నాడు.

సమరసేనుడు సైనికులను హెచ్చ రించి, వ్యాఘ్రదత్తుడి భటులు ఎటు వెళతారా అని చూడసాగాడు. వ్యాఘ్ర దత్తుడి వాలకం చూస్తే, అతడు సమర సేనుడి మాటే మరిచినట్టు కనబడు తున్నది.

వ్యాఘ్రదత్తుడు తను సాధించదలచు కున్న మహాకార్యం సాధించినవాడిలా భటు లకు ముందుండి ధీమాగా నడుస్తున్నాడు. ఇక భటులు నవ్వుతూ, ఆయుధాలు ఊపుతూ, మధ్యమధ్య ఉత్సాహంగా కేకలు పెడుతున్నారు.

శివదత్తుడు ఎక్కడ దాక్కున్నదీ గ్రహించి, వ్యాఘ్రదత్తుడు అతణ్ణి బందీగా పట్టుకున్నాడా, అన్న అనుమానం కలిగింది సమరసేనుడికి. కాని, భటుల వెంట బందీ చేయబడిన వారెవరూ లేరు. "బహుశా, అపూర్వశక్తులు గల శాక్తేయుడి త్రిశూలం ఎక్కడ వున్నదీ, వ్యాఘ్రదత్తుడికి తెలిసి పోయి వుండవచ్చు!" అనుకున్నాడు సమరసేనుడు.





వ్యాఘ్రదత్తుడు శిథిలమైపోయిన భవనాల వెంట తన భటులను నడిపించసాగాడు. అతడు వెళ్ళవలసిన చోటు ఏదో ముందే నిర్ణయించుకున్నట్టు, సూటిగా భటులకు దారిచూపుతున్నాడు.

ఇలాంటి అదను కోసమే వేచివున్న సమరసేనుడు, రాళ్ళచాటున నక్కుతూ, తన సైనికులతో శిథిలమై వున్న ఒక పెద్ద భవన ప్రాంగణం చేరుకున్నాడు. అక్కడ సగం విరిగి వున్న స్తంభాల చాటున దాగి వుండి, వ్యాఘ్రదత్తుడి కేసి చూడసాగాడు.

భటుల ముందు నడుస్తున్న వ్యాఘ్రదత్తుడు ఠక్కున ఒకచోట ఆగి, "వ్యాఘ్రయోధుల్లారా! మన శ్రమ ఫలించే సమయం వచ్చింది. మీలో ప్రతి ఒక్కణ్ణీ ఒక దేశానికి రాజుగా చేస్తానని వాగ్దానం చేశానుగదా? ఆ వాగ్దానం తప్పక నిలుపుకుంటాను. కాని, మీరు యీ నిమిషాన ఒక సాహసకార్యం చెయ్యవలసి వుంది," అన్నాడు గంభీరంగా.

"మేం ఎంతటి సాహసకార్యానికైనా సిద్ధమే! అదేమిటో చెప్పండి," అంటూ భటులు కేకలు పెట్టారు.

వ్యాఘ్రదత్తుడు మందహాసం చేస్తూ, "ఈ శిథిలనగరంలో మన కోర్కెలు నెరవేరబోతున్నవి. అదుగో, ఆ ఎదురుగా వున్న భవనం చూడండి. దాని సింహద్వారం విరిగి రాళ్ళతో కప్పబడిపోయింది. మీరు అక్కడ అడ్డుగా వున్న రాళ్ళనూ, విరిగిన స్తంభాలనూ తొలగించి, మార్గం సరిచేయండి. మనం వెతికి సంపాయించవలసిన అమూల్య వస్తువు, ఆ భవనంలోనే వున్నది," అన్నాడు.

వ్యాఘ్రదత్తుడు యిలా అనగానే భటులకు ఎక్కడలేని ఉత్సాహం కలిగింది. వాళ్ళు గొడవగొడవగా మాట్లాడుకుంటూ, హెచ్చరికలు చేసుకుంటూ, ఆ శిథిల భవనాన్ని సమీపించారు. కొందరు పలుగులు తీసుకుని, ద్వారానికి అడ్డుగా ఉన్న పెద్దపెద్ద గండశిలలను పక్కకు నెట్టసాగారు.



భటులు వాళ్ళ ఉత్సాహంలో, దురాశలో మునిగి రానున్న ప్రమాదాన్ని గ్రహించలేదు. శిధిలమైపోయిన ఆ భవనం తాలూకు గోడలూ, స్తంభాలూ పక్కలకు ఒరిగి పడేందుకు సిద్ధంగా వున్నవి.

సమరసేనుడు దూరంగా వుండి, యిదంతా గమనిస్తున్నాడు. వ్యాఘ్రదత్తుడి ఆజ్ఞాపాలన చేస్తున్న భటులు ఏ గోడ గాని, స్తంభంగాని విరిగి పడడంతో బలవన్మరణం చెందబోతున్నారని తెలుస్తూనే వున్నది!

వ్యాఘ్రదత్తుడు మాత్రం కొంచెం ఎడంగా నిలబడి, రాళ్ళను పక్కలకు లాగుతున్న భటులను ఉత్సాహపరుస్తున్నాడు. అతడు తలతిప్పి పక్కలకు చూస్తున్న ధోరణీ, భవనం కేసి గుచ్చిగుచ్చి చూడడం గమనించిన సమరసేనుడికి, ఆ దుర్మార్గుడు కూడా రానున్న ప్రమాదాన్ని శంకిస్తున్నాడని తోచింది.

వ్యాఘ్రదత్తుడు కావాలనే తన భటులను యిలాంటి ప్రమాదంలో చిక్కుకునేట్టు చేస్తున్నాడేమో అన్న ఊహ సమరసేనుడికి కలిగేంతలో, పెళపెళా రావాలతో శిధిలభవనం ఒక్కసారిగా కూలిపోయింది. విరిగిపడుతున్న స్తంభాల కిందా, గోడలకిందా పడి వ్యాఘ్రదత్తుడి భటులు చాలామంది హాహాకారాలు చేస్తూ మరణించారు. కొందరు భటులు బలమైన గాయాలతో ప్రాణాలు దక్కించుకుని బయటపడ్డారు.

ఈ భయంకర సంఘటన రెప్పపాటు కాలంలో జరిగిపోయింది. ప్రాణాలతో బయటపడిన కొద్దిమంది భటులతో వ్యాఘ్రదత్తుడు దూరంగాపోయి నిలబడ్డాడు. తనను నమ్మి అనేక మంది భటులు దుర్మరణం పాలుకావడం అతడికి చీమకుట్టినంత బాధకూడా కలిగించలేదు.

"వ్యాఘ్రేశ్వరికి ఏదో అపచారం జరిగింది! అందువల్లనే అంతమంది

ఆ సింహద్వారం ముందు బలైపోయారు. ఇక మనకు వచ్చిన భయంలేదు, ధైర్యంగా వుండండి!" అంటూ వ్యాఘ్రదత్తుడు తన చేతిలో వున్న ఒక పటాన్ని వాళ్ళకు చూపుతూ, "అద్భుత శక్తులు గల శాక్తేయుడి త్రిశూలం వున్న చోటు మీ అందరికీ చెప్పదలిచాను. దాని ప్రభావం వలన, మిగిలివున్న మనమే, ఈ ప్రపంచానికి రాజాధిరాజులం కావచ్చు. ఆ త్రిశూలం వున్నచోటు ఈ పటంలో స్పష్టంగా చూపబడింది. ఏనుగుల వనంలో, విషవృక్షానికి వందగజాల దూరంగా, మృతవీరుల సమాధి కింద, గురుద్రోహి అస్థిపంజరంలో శాక్తేయుడి త్రిశూలం దాచబడింది!" అన్నాడు.

చాటున వుండి యీ మాటలు వింటున్న సమరసేనుడికి ఆశ్చర్యంతో, అంతకన్న భయంతో దేహం వణికిపోయింది. ఏ అపూర్వశక్తులుగల త్రిశూలం కోసం మంత్రాలదీవిలో యిన్ని హత్యలూ, యుద్ధాలూ జరుగుతున్నవో, ఆ త్రిశూలం చివరకు వ్యాఘ్రదత్తుడిలాటి పరమ దుష్టుడికి లభ్యం కాబోతున్నది!

ఇప్పుడు చేయవలసిందేమిటి, అన్న ప్రశ్న సమరసేనుణ్ణి బాధించసాగింది. శివదత్తుడు ఏమయాడు? అతడికి త్రిశూలం ఎక్కడ వున్నదీ తెలుసా?




తన దగ్గిరవున్న సైనికులతో వ్యాఘ్రదత్తుణ్ణి ఎదుర్కొనటం క్షేమమా, కాదా?

సమరసేనుడు ఎటూ నిర్ణయించుకోలేకపోయాడు. ఒకసారి వ్యాఘ్రదత్తుడి చేతికి ఆ త్రిశూలం చిక్కటం జరిగితే, ఇక అతణ్ణి ఎదిరించటం ఎవరితరమూ కాదు. మంత్రతంత్ర విద్యల్లో సాటిలేని వారి మని భావించే ఏకాక్షి, చతుర్నేత్రులు కూడా అతడికి దాసోహం అనక తప్పదు. ధనరాసులతో నిండివున్న నావా, దానిని కాపాడుతున్న నాగకన్య కూడా అతడి వశమైపోక తప్పదు.

ఇలాంటి ఆపత్సమయంలో తనకు సహాయం చేయగలవాడు ఒక్క

చతుర్నేత్రుడు తప్ప ఎవరూ లేరు. కాని, చతుర్నేత్రుడికి, యీ పరిస్థితులు తెలియటం ఎట్లా? నాగకన్య కోసం ప్రయత్నించే అతడికి, శాక్తేయుడి శక్తి వంతమైన త్రిశూలం సంగతి తెలుసునా, తెలియదా? ఆ త్రిశూలం ఒక్కదాన్ని సంపాయించగలిగితే, మొత్తం యీ ద్వీపాన్నే కాక, ప్రపంచాన్నే జయించ వచ్చునన్న సంగతి నిజమా, కాదా?

సమరసేనుడు యిలాంటి ఎడతెగని ఆలోచనలలో వుండగా, వ్యాఘ్రదత్తుడి కంచుకంఠం తిరిగి మార్మోగింది: "రేపు మహాపర్వదినం. అమావాస్యా ఆదివారం. కనక, యీ రాత్రికి అందరం యిక్కడే విశ్రాంతి తీసుకుందాం. రేపు రాత్రి సరిగా ఒంటిగంటకు, మనం ఏనుగులవనం ప్రవేశించాలి."

వ్యాఘ్రదత్తుడు భటులకు యీవిధంగా చెప్పి, కూలిపోయిన సింహద్వారానికి దాపులవున్న ఒక రాతిమీద కూర్చున్నాడు. భటులు కూడా తమతమ ఆయుధాలు కిందపెట్టి, అతడి చుట్టూ వలయాకారంలో కూర్చున్నారు.

సమరసేనుడికి, వ్యాఘ్రదత్తుడి మాటలు కొంత ఆశ కలిగించినై. తనకు యింకా ఇరవైనాలుగ్గంటల వ్యవధివున్నది. ఈ కాలంలో తను ఏదో విధంగా—నిద్రిస్తున్న వ్యాఘ్రదత్తుడి మీద పొంచి దూకి అయినా సరే, అతణ్ణి హతమార్చాలి. ప్రస్తుతానికి తనూ, తన సైనికులూ విశ్రాంతి తీసుకోవచ్చు....

ఇలా ఆలోచించి సమరసేనుడు గిరుక్కున వెనుదిరిగాడు. ఆ తిరగటంలో అతడు ఆనుకునివున్న సగం విరిగిన రాతి స్తంభం పెద్ద ధ్వనితో కూలిపడింది.

ఆ ధ్వని వింటూనే దెబ్బతిన్న బెబ్బులిలా వ్యాఘ్రదత్తుడు లేచి నిలబడ్డాడు. అతడితో పాటు భటులు కూడా, తమతమ ఆయుధాలు తీసుకుని లేచారు. వ్యాఘ్రదత్తుడి దృష్టి సూటిగా సమరసేనుడు దాగివున్న శిధిలభవనం మీదికి ప్రసరించింది. —(ఇంకావుంది)






# ఆదర్శప్రభువు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, లోకంలో కొంతమంది సత్కార్యాలు చేసి ఆదర్శ ప్రాయులవుతారు. కాని పాపకార్యాలు చేసి కూడా ఆదర్శప్రాయులైనవాళ్ళు వున్నారు. ఇందుకు నిదర్శనంగా గుణసింహు డనే రాజు కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం విదర్భను పాలించిన జయ సింహుడికి ఇద్దరు కొడుకులు. పెద్దవాడు వీరసింహుడు, చిన్నవాడు గుణసింహుడు. గుణసింహుడికి చిన్ననాటినుంచీ రాజ్య పాలన మీదా, క్షాత్రవిద్యలమీదా ఆసక్తి వుండేది. అతను మంత్రి మాణిక్యవర్మ వద్ద రాజనీతినీ, సేనాధిపతి శూరసేనుడి వద్ద

## బేతాళ కథలు



క్షాత్రవిద్యల్ని క్షుణ్ణంగా నేర్చుకున్నాడు. వీరసింహుడు ఇందుకు పూర్తిగా వ్యతిరేకం. అతడికి రాజభోగాల మీద వున్నంత ఆసక్తి రాజ్యవ్యవహారాల మీద లేదు.

జయసింహుడు ఆచారం ప్రకారం వ్యసనాలకు లోనయిన వీరసింహుడికే పట్టం కట్టాలనుకున్నాడు. అది గమనించిన గుణసింహుడు తన గురువు లయిన మంత్రిని, సేనాధిపతిని తన కనుకూలంగా చేసుకుని వీరసింహుడి పట్టాభిషేకానికి ముందురోజు రాత్రి తండ్రినీ, అన్ననూ బంధించి చెరసాలలో వేసి, మరుసటి రోజు తన పట్టాభిషేకానికి ఏర్పాట్లు చేసుకున్నాడు.

గుణసింహుడి పట్టాభిషేకం జరుగుతున్న సమయంలో, బ్రాహ్మణులు మంత్రాలు చదువుతుండగా మంత్రి వజ్రాల కిరీటాన్ని గుణసింహుడి తలపై వుంచబోయాడు.

"ఇదేమిటి?" అన్నాడు గుణసింహుడు.

"ప్రభూ! ఇది కోట్లకు విలువజేసే వజ్రాలు పొదగబడిన కిరీటం! తరతరాలుగా దీన్ని ధరించే మీ వంశంవారు పాలన సాగిస్తున్నారు!" అన్నాడు మంత్రి.

"వజ్రాలు పొదిగిన కిరీటం తలపై లేందే, రాజు పరిపాలన చేయలేడా ఏమిటి?" అన్నాడు గుణసింహుడు.

గుడ్లప్పగించి చూస్తున్న మంత్రితో గుణసింహుడు మళ్ళీ, "నేటినుంచి రాజభోగాల పేరిట అవుతున్నవ్యయాన్నికూడా ఆపండి! నేను కూడా ఆస్థానంలో ఒక ఉద్యోగినే గనక నాకు కూడా తగిన వేతనం ఏర్పాటు చేయండి!" అన్నాడు.

మంత్రితో పాటు సభికులు నివ్వెరపోయారు. తర్వాత గుణసింహుడు తన కొచ్చేవేతనంతోనే నిరాడంబరంగా జీవనం సాగించాడు. అతడు ప్రజల సమస్యల పట్ల శ్రద్ధచూపుతూ, మంచి పథకాలను అమలుచేసి కొద్దికాలంలోనే సుభిక్షమైన రాజ్యాన్ని నెలకొల్పాడు.

విదర్భకు నూరామడల దూరాన విరూపరాజ్యం వున్నది. దాని రాజు చిత్రసేనుడు. అతడు అన్నివిద్యల్లోనూ ఆరితేరి వున్న యువరాజు విజయసేనుడికి పట్టం కట్టి, తాను విశ్రాంతి తీసుకోవాలనుకుని విజయసేనుడితో ఇలా అన్నాడు:

"నీ విద్యాభ్యాసం పూర్తయిన మాట నిజమే. కాని రాజుకు శాస్త్రజ్ఞానం ఒక్కటే చాలదు. అనుభవం కూడా వుండాలి! దేశాటన చేస్తూ, ఆదర్శప్రభువు లెవరయినా తటస్థపడితే వారి వద్ద కొంతకాలం వుండి పరిపాలనలో గల మెలకువలు తెలుసుకొనిరా!" అన్నాడు.

తండ్రి మాట ప్రకారం విజయసేనుడు దేశాటనకు బయలుదేరి, దారిలో ఎదురయిన రాజ్యాలను చూస్తూ, రాజుల గుణగణాలు, రాజ్యాల స్థితిగతులు తెలుసుకుంటూ ప్రయాణం సాగించి, కొంతకాలానికి విదర్భ చేరాడు. విదర్భ ప్రజల ద్వారా గుణసింహుడి గురించీ, అతడి పరిపాలనా విధానాల గురించీ విని, అతణ్ణి చూడబోయి, తన కోరిక చెప్పాడు.

విజయసేనుడు తన ఆస్థానంలో కొంతకాలం వుండేందుకు గుణసింహుడు సంతోషంగా ఒప్పుకున్నాడు.

విజయసేనుడు గుణసింహుడి కొలువులో కొంతకాలం వుండి, తన రాజ్యానికి తిరిగిపోయి పట్టం కట్టుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా! పట్టం కట్టుకుని, రాజ్యం ఏలవలసిన సమ



యంలో తండ్రి మాట మీరక శ్రమకోర్చి దేశాటన చేసిన విజయసేనుడు, గుణ సింహుణ్ణి ఆదర్శ ప్రభువుగా గుర్తించడంలో పొరపాటు చేశాడనిపిస్తున్నది. రాజ్యకాంక్షతో తండ్రిని, తోడబుట్టినవాణ్ణి చెరసాల పాలుచేసిన గుణసింహుడు ఆదర్శప్రభువెలా అవుతాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "గుణ సింహుడు రాజ్యకాంక్షతో తండ్రినీ, తోడ బుట్టినవాణ్ణీ చెరసాల పాలుచేశాడనటానికి ఆధారం లేదు. వ్యసనపరుడైన రాజు నుంచి ప్రజలను కాపాడేందుకూ, వారికి మంచి పరిపాలన ఏర్పాటు చేసేందుకూ, అలాచేయడం అతనికి తప్పనిసరయింది. గుణసింహుడు రాజ్యకాంక్షతోనే ఆ పని చేసివున్నట్టయితే రాజభోగాలను విడిచి పెట్టి వుండేవాడు కాదు. ప్రజల బాగోగుల్ని అంతగా పట్టించుకొనేవాడూ కాదు. అంతే గాక తాను అధికుణ్ణన్న భావాన్ని విడిచి, ప్రజలలో తానూ ఒకడైపోతే ప్రజల సమస్యల పరిష్కారం మరింత సులువు అవుతుందన్న నమ్మకంతో, తనకొచ్చే వేతనంతోనే సామాన్యమైన జీవితాన్ని గడుపుతూ, ప్రజలకు సుఖశాంతుల నేర్పరచటం ద్వారా గుణసింహుడు అక్షరాలా ఆదర్శప్రభువు లక్షణాలను కనబరిచాడు. తండ్రికీ, తోడబుట్టినవాడికీ ద్రోహం చేశాడనుకుంటే అది అతడి వ్యక్తిగత విషయం. అతడి వ్యక్తిగత విషయాలకన్నా రాజుగా అతడు ప్రజలకేపాటి సేవ చేయగలిగాడన్నది ముఖ్యం. ఆ కారణంగా గుణసింహుడు ఆదర్శపుత్రుడూ, ఆదర్శ సోదరుడూ కాదేమో గాని, ఆదర్శప్రభువనడానికి ఎలాంటి సందేహం లేదు. అతణ్ణి ఆదర్శప్రభువుగా గుర్తించడంలో విజయసేనుడు పొరపడిందేమీ లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)





# గ్రహణస్నానం

నాగభూషణం గ్రామంలోని పెద్ద రైతుల్లో ఒకడు, మంచి మాటకారి. ఆకలి లేని వాడూ, అప్పు లేని వాడూ లోకంలో వుండరు, అంటూండేవాడు. తను పేరుకు ఆస్తిపరుడిలా కనిపించినా, తనకూ ఏవో అప్పులున్నవని యితర్లతో చెబుతూండే వాడు. కాని, ఎవరైనా అవసరంపడి వస్తే, పెద్ద వడ్డీలకు అప్పులిస్తూండేవాడు.

ఒకసారి అతడి పొరుగున వుండే పేద రైతు సోమనాధు డనేవాడు అప్పు కోసం వచ్చాడు. సోమనాధుడి కున్న రెండెకరాల పొలం, నాగభూషణం పొలాల పక్కనే వున్నది. ఎంతోకాలంగా ఆ రెండెకరాల పొలం, తన పొలంలో కలుపుకోవాలని నాగభూషణం ఆశపడుతున్నాడు.

"సోమన్నా, అవసరం కొద్దీ నేను పొరుగూరు షావుకార్ల దగ్గిర పెద్ద వడ్డీలకు అప్పుతెస్తున్న సంగతి మన గ్రామంలో చాలా మంది ఎరగరు. ఎవరి అవసరాలు వాళ్ళవి!" అంటూ నాగభూషణం, సోమ నాధుడి రెండెకరాల పొలం తాకట్టు పెట్టించుకుని, అతడు అడిగిన దానికి మరి కొంత చేర్చి, అప్పుయిచ్చాడు.

ఆ తరవాత వరసగా రెండు సంవత్స రాలు సరైన వర్షాలు లేక సోమనాధుడి పంటపొలం దెబ్బతిన్నది. ఇక తన బాకీ తీర్చలేడని నమ్మకం కలిగాక, నాగ భూషణం, సోమనాధుణ్ణి డబ్బు కోసం తొందరపెట్టాడు. సోమనాధుడు మరొక పంటకాలం ఆగమని కాళ్ళావేళ్ళా పడ్డాడు.

"ఈ రాబోయే పంటకాలంలో మాత్రం వర్షాలుంటవన్న నమ్మకం ఏమిటి? ప్రాణంపోకడ, వర్షంరాకడముందే తెలిస్తే, యిక లేందేమిటి? అవతల రుణదాతలు పీకమీద కూర్చున్నారు. నీది చిన్న అప్పు, పోయేది రెండెకరాలే. నేను బాకీ కింద

వి. యజ్ఞరామయ్య

వాళ్ళకు పదెకరాల పొలం యిచ్చుకోవలసి వస్తుంది.'' అన్నాడు నాగభూషణం.

తన బాకీగ్గాను రెండెకరాల పొలం యివ్వమంటున్నాడని గ్రహించిన సోమనాథుడు యిక చేసేది లేక, నాగభూషణానికి పొలం యిచ్చేశాడు. నాగభూషణం తానేదో ఘనకార్యం సాధించినట్టు ఆనందపడిపోయాడు.

ఆ తరవాత వారం రోజులకు సూర్యగ్రహణం వచ్చింది. అతడి మిత్రులు నదికి స్నానానికి రమ్మన్నారు. అక్కడ చేరే యాచకులకు ధర్మం చేయవలసి వస్తుందన్న భయంతో, ''ఆ నదిలో నీరే కదా, పిల్లకాలవ ద్వారా మన ఊరి నల్లచెరువుకు వస్తుంది. ఆ గ్రహణస్నానం చేయడానికి నల్లచెరువు నీరు పనికిరాదా ?'' అన్నాడు నాగభూషణం.

డబ్బు విషయంలో నాగభూషణం గిజినిపట్టు ఎరిగున్న మిత్రులు నవ్వుకుని తమ దారిన వెళ్ళిపోయారు. కొంచెంసేపాగి నాగభూషణం నల్లచెరువుకు బయలుదేరాడు. అతడు అక్కడి స్నానాల రేవు ప్రాంతం చేరేసరికి, గట్టుమీద కొందరు ముష్టివాళ్ళూ, దిగువున స్నానాలు చేస్తూ కొందరు ముసలిగ్రామస్థులూ కనిపించారు.

నాగభూషణం ముష్టివాళ్ళ కంటబడకుండా వుండేందుకు చెరువుగట్టు వెంట మరొక ప్రాంతానికి పోయి, అక్కడ వున్న బండరాళ్ళమీదుగా చెరువులో దిగుతూ,



కాళ్ళుజారి లోతు నీళ్ళల్లో పడిపోయాడు. అతడికి ఈతరాని కారణంగా, నీళ్ళల్లో మునిగి, తేలుతూ రక్షించండంటూ కేకలు పెట్టసాగాడు.

ఆ సమయంలో పొరుగూరు నుంచి చెరువుగట్టు మీదుగా నడిచి వస్తున్న సోమనాధుడు, నాగభూషణం గొంతు గుర్తించి, జాలికొద్దీ పరిగెత్తికెళ్ళి, అతణ్ణి ఒడ్డుకు లాగాడు.

నాగభూషణం రాళ్లమీంచి జారి నీళ్లల్లో పడే సమయంలో అతడి కుడికాలుకు గట్టిదెబ్బ తగిలి, బెణికిపోయింది. తన కేసి కృతజ్ఞతగా చూస్తూ బాధతో మూలుగుతున్న నాగభూషణాన్ని, సోమనాధుడు భుజంమీద వేసుకుని, ఇంటికి చేర్చాడు.

మంచంలో కదలలేక పడివున్న నాగభూషణానికి నాటువైద్యుడు చికిత్స ప్రారంభించాడు. ఆ చికిత్సతో కాలు నయం కాకపోగా, దెబ్బ తగిలినచోట గాయం మరింతగా బాధ పెట్టసాగింది. ఈ లోపల దగ్గిర, దూరపు బంధువులంతా అతణ్ణి చూడవచ్చి, ఇంట్లో మకాం పెట్టారు.

నాగభూషణానికి శరీర బాధతోపాటు, యీ వచ్చి కూర్చున్న బంధుగణాన్ని ఎలా వదిలించుకోవడమా అన్న బెంగతో రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టడం లేదు.

ఆ స్థితిలో ఒకనాడు కోడలు, భర్తతో, '' ఈ ముసలాయన సంగతి ఎటోతేలిపోతే భావుండును. ఈ చుట్టాల మందకు వండి



వార్చలేక మధ్య నేను చస్తున్నాను,'' అనడం అతడి చెవుల బడింది.

ఇది విన్న నాగభూషణానికి తల తిరిగి పోయింది. తను యింత కష్టపడి సంపా యిస్తున్నది తన కొడుకు కోసం, మనవళ్ల కోసం! భార్య అన్నదానికి కొడుకు నోరెత్తకపోవడం అతడికి మరింత బాధ కలిగించింది.

ఆ మర్నాడు మామూలు ప్రకారం సోమనాధుడు అతణ్ణి చూడవచ్చాడు. నాగభూషణం కన్నీళ్ళపర్యంతం అయి పోతూ, రాత్రి తన కోడలు అన్న మాటలు చెప్పి, ''సోమన్నా, నే చేసిన పాపమే నన్ను పట్టి పీడిస్తున్నది. బుద్ధెరిగి ఒక్క ధర్మకార్యం చెయ్యలేదు. కాలమంతా పెడమార్గాల ధనార్జనకే గడిపాను. ఇప్పుడు అనుభవిస్తున్నాను,'' అన్నాడు.

సోమనాధుడు, అతణ్ణి ఓదార్చి, ''పశ్చాత్తాపానికి అన్ని పాపాలనూ కడిగి వేసే శక్తి వున్నదంటారు. నల్లచెరువులో గ్రహణస్నానం మిమ్మల్ని పుణ్యాత్ముల్ని చేసింది. ఈ నాటువైద్యం లాభంలేదు. పట్నానికి వెళదాం పదండి. అక్కడ మంచి వైద్యనిపుణులుంటారు,'' అన్నాడు.

సోమనాధుడి వెంట నాగభూషణం పట్నం వెళ్లి, అక్కడ సమర్థులైన వైద్యుల చికిత్సతో నెలరోజులు తిరక్కుండానే, మామూలు మనిషయి ఇంటికి తిరిగి వచ్చాడు. అతడు యింకా ఇల్లు పట్టివున్న బంధుగణాన్ని మంచి మాటలతో సాగ నంపి, ఒకనాటి ఉదయం సోమనాధుణ్ణి తన వెంట పొలం తీసుకుపోయాడు.

ఇద్దరూ పొలం గట్టున కూర్చున్నారు. నాగభూషణం తను అప్పుకింద సొంతం చేసుకున్న సోమనాధుడి పొలాన్ని చేఎత్తి చూపుతూ, ''సోమన్నా, నేను గ్రహణ స్నానంతో పుణ్యాత్మ్ముణ్ణయానన్నావు; ఆ సంగతి నాకు తెలియదు. కాని, యిక ముందు పాపాత్ముడుగా బతకతలచ లేదు. అప్పుకింద ఆక్రమించుకున్న నీ రెండెక రాల పొలం, నీకు తిరిగి యిచ్చేస్తు న్నాను,'' అన్నాడు.



# గడసరి బిచ్చగాడు

రంగాపురానికి కొత్తగా ఒక బిచ్చగాడు వచ్చి, నాలుగు వీధులూ తిరిగి, యింత కబళం యాచించి పొట్ట నింపుకోసాగాడు. కాని ఒక ఇంటి యజమాని మాత్రం బిచ్చగాడు ఎప్పుడు వెళ్ళినా, "అన్నంలేదు గిన్నంలేదు, పో అవతలికి!" అంటూ చిరు బుర్రులాడేవాడు.

ఆ ఇల్లు పరమలోభి అయిన రంగయ్యది. ఒకనాడు బిచ్చగాడు రంగయ్య ఇంటికి వెళ్ళి, "మాతా అన్నపూర్ణేశ్వరీ!" అంటూ గట్టిగా కేక పెట్టాడు.

రంగయ్య మండిపడుతూ, "నీ కెన్నిసార్లు చెప్పాలి? అన్నంలేదు గిన్నంలేదు. వెళ్ళవతలికి," అంటూ తలుపు మూయబోయాడు.

వెంటనే బిచ్చగాడు, "క్షమించండి: ఈ రోజు నేను అన్నం యాచించడానికి రాలేదు, బాబూ!" అన్నాడు.

"మరెందుకొచ్చావు?" అన్నాడు రంగయ్య కోపంగా.

"నేను ఎప్పుడు వచ్చినా అన్నం లేదంటున్నారుగదా? అందువల్ల నేను అక్కడా, యిక్కడా యాచించి తెచ్చినదాంట్లో కొంత మీ కిద్దామని పిలిచాను. గిన్నె పట్టుకురండి!" అంటూ బిచ్చగాడు జోలె విప్పాడు.

—రేవా నాగేశ్వరరావు.






ఒక ఊళ్ళో సోమశాస్త్రి అనే సకల విద్యా పారంగతుడుండేవాడు. ఆయన చదవని శాస్త్రాలు లేవు. ఆయనకు తెలియని ధర్మాలు లేవు. తనకు తెలిసినవన్నీ అందరికీ చెప్పడం కోసం, ఆయన ఒక గురుకులాన్ని స్థాపించాడు.

సోమశాస్త్రి పేరుప్రఖ్యాతులు విని, ఎందరో విద్యార్థులు గురుకులానికి రాసాగారు. కాని, దురదృష్టమేమిటంటే, ఆయన ఏమి చెప్పినా శిష్యులకు అర్థమయ్యేది కాదు. ఇందువల్ల క్రమంగా గురుకులానికి వచ్చే శిష్యుల సంఖ్య బాగా తగ్గిపోయింది.

ఇలావుండగా, ఆ ఊరికి సుశాంతుడనే నడివయసు వాడొకడు వచ్చాడు. ఆయనకు నా అన్నవారెవరూ లేరు. ఉన్న ఊళ్ళో ఆస్తి అంతా అగ్నికి ఆహుతికాగా పూలమ్మినచోట, కట్టెలమ్మడం యిష్టం లేక, ఈ ఊరు చేరి ఒక ధనికుడి ఇంటికి వెళ్ళి, తన కథ చెప్పుకున్నాడు.

ధనికుడు అంతా విని, "ఈ ఊళ్ళో చదువు చెప్పే సరి అయిన గురువు లేక చాలా యిబ్బందిగా వుంది. నువు, పిల్లలకు చదువు చెప్పగలిగితే, యిక్కడ నీకు భుక్తికి లోటుండదు," అన్నాడు.

సుశాంతుడికి అంతగా చదువురాదు. ఆ సంగతి ఆయన ధనికుడితో చెప్పకుండా, "పదిరోజుల్లో మంచిముహూర్తం ఉన్నది. ఆ రోజున నేను గురుకులం ప్రారంభిస్తాను. అందుకు అనువైన స్థలం మాత్రం తమరు యిప్పించండి," అన్నాడు.

ధనికుడు సంతోషంగా అంగీకరించాడు.

ముహూర్తదినంలోగా సుశాంతుడు, సోమశాస్త్రిని కలుసుకుని, "ఈ ఊరిలో తమబోటి పండితులుండగా, గురువులకు కొరత ఎలా వచ్చింది?" అని అడిగాడు.

"వసుంధర"

'' తల్లిదండ్రులు సంపాయించిన ఆస్తి నా కున్నది. నా విద్యను పదిమందికీ పంచి పెట్టాలన్న కోర్కె తప్పితే, నాకు ధనాశ లేదు. కానీ, ఎందువల్లనో విద్యార్థులకు నేను చెప్పే పాఠాలు బోధపడకుండా వున్నవి;'' అన్నాడు సోమశాస్త్రి విచారంగా.

'' తమరేం విచారించకండి! మీ విద్యను నేను పదిమందికీ పంచిపెడతాను. మీరు, నాకు చదువు చెప్పండి. అది నేను నా శిష్యులకు నేర్పుకుంటాను,'' అన్నాడు సుశాంతుడు.

'' నా వల్ల కాని పని, నీ వల్ల అవుతుందా ?'' అన్నాడు సోమశాస్త్రి సందేహంగా చూస్తూ.

'' అనుమానించకండి. మీరు నాకు చదువు చెప్పకపోతే, నాకు భుక్తి గడవదు,'' అన్నాడు సుశాంతుడు.

సోమశాస్త్రి మారు మాట్లాడకుండా, సుశాంతుడికి చదువు చెప్పడానికి ఒప్పుకున్నాడు. పదిరోజుల్లోనే సుశాంతుడు, సోమశాస్త్రి వద్ద కొంత నేర్చుకుని, గురుకులం ప్రారంభించాడు.

సుశాంతుడి అవగాహన గొప్పది. ఆయన సోమశాస్త్రి చెప్పే ప్రతి విషయాన్నీ చక్కగా ఆకళింపు చేసుకుని, దాన్నే చక్కని రూపంలో చిన్నపిల్లలకు అర్థమయ్యే విధంగా చెప్పేవాడు. సుశాంతుడి బోధనా



పద్ధతి పిల్లలకు చక్కగా సరిపడింది. ఎంతో క్లిష్టతరమైన శాస్త్రాలను కూడా పిల్లలు అర్థంచేసుకోసాగారు.

ప్రతిరోజూ సుశాంతుడు, సోమశాస్త్రి వద్దకు వెళ్ళి చదువు నేర్చుకునేవాడు. తను తెలుసుకున్న విషయాలన్నీ కథలుగా మార్చి పిల్లలకు చెప్పేవాడు. క్రమంగా సుశాంతుడికి శిష్యులు పెరిగారు. అంత మందికి తానొక్కడే చెప్పలేక, తన కథలన్నిటినీ పుస్తకంగా రాసి, అందులోని వివరాలతో మరికొందరు కొత్త వారికి శిక్షణయిచ్చేవాడు. క్రమంగా సుశాంతుడి గురుకులం ఒక విశ్వవిద్యాలయంగా మారిపోయింది.

సుశాంతుడి ప్రతిభ గురించి, ఆ దేశాన్నేలే రాజుకు తెలిసింది. ఆయన సుశాంతుణ్ణి పిలిపించి, కొంతకాలంపాటు రాజధానిలో వుండి, రాజకుమారులకు చదువు నేర్పవలసిందిగా కోరాడు.

సుశాంతుడు రాజుతో వినయంగా, ''ప్రభూ, యిందులో నా గొప్పతనం ఏమీ లేదు. సోమశాస్త్రి అనే మహా విద్వాంసుడి వద్ద, నేను ప్రతిరోజూ శుశ్రూష చేసి, కొంచెం కొంచెంగా చదువు నేర్చుకుని, చిన్నపిల్లల కోసం ఆ నేర్చుకున్నదాన్ని మార్చి రాస్తున్నాను. నే నింకా నేర్చుకోవలసిన దెంతో వున్నది. తమరు దయవుంచి రాజకుమారులను విద్యాలయానికి పంపిస్తే, అక్కడవున్న యితర విద్యార్థులతో పాటు, నాకూ ఎంతో మేలుచేసిన వారవుతారు,'' అన్నాడు.

రాజు ఆశ్చర్యపోయి, ''నీకంటే, ఎవరో ఆ సోమశాస్త్రి గొప్పవాడా? అదే నిజమైతే, ఆ సోమశాస్త్రే విద్యాలయాన్ని నడపవచ్చు గదా!'' అన్నాడు.

''ప్రభూ, మీకు తెలియనిదేమున్నది! ఈ సృష్టికి శక్తి నిస్తున్న సూర్యుణ్ణి మనం కళ్ళు తెరిచి చూడగలమా? మనం చూడలేనంత మాత్రాన, సూర్యుడి శక్తి అబద్ధమవుతుందా? సోమశాస్త్రి, సూర్య భగవానుడు, ప్రభూ! నా బోటివాళ్ళకు శక్తి ఆయన నుంచే లభిస్తున్నది,'' అన్నాడు సుశాంతుడు.

రాజు వెంటనే, ''సోమశాస్త్రి సూర్య భగవానుడైతే తేరిచూడ అశక్యమైన ఆ తేజాన్ని, వెన్నెలగా మార్చి మనుషులపై కురిపించే చందమామవు, నువ్వు!'' అని, అప్పటికప్పుడే, తన కుమారులను సుశాంతుడి వెంట విద్యాలయానికి పంపాడు.

ఆ నాటినుంచీ సుశాంతుడికి చందమామ అన్న కొత్త పేరు కూడా వచ్చింది. అంతేకాక, కష్టమైన విషయాన్ని పిల్లలకు సులభశైలిలో చెప్పగలిగేవాళ్ళను, చందమామ అని పిలిచే సంప్రదాయం కూడా అప్పుడే ఏర్పడింది.





# విలువ తెలియనివాడు

పూర్వం ఒకప్పుడు మగధరాజు విరూపసేనుడి కాలంలో, బోధిసత్వుడు ఒక ఏనుగురూపం తాల్చాడు. ఆ ఏనుగు తెల్లని శరీరచ్ఛాయతో ఐరావతాన్ని పోలి వున్నది. అందుచేత మగధరాజు ఆ ఏనుగును తన పట్టపుటేనుగుగా చేసుకున్నాడు.

ఒక పర్వదినం నాడు మగధరాజ్యమంతా దేవలోకాన్ని మించి అలంకరించబడింది. నగరమంతటా అతి వైభవమైన ఊరేగింపు జరపటానికి ఏర్పాట్లు చేశారు. పట్టపుటేనుగును చక్కగా అలంకరించారు. సైనికులు ముందూ, వెనకా నడుస్తూండగా రాజు ఆసీనుడై వున్న ఏనుగు అంబారీ ఊరేగింపు బయలుదేరింది.

దారి పొడుగునా జనం ఉత్సాహంతో, "ఆహా, ఏమి యీ గజరాజు గమనం! దీని అందచందాలు చూస్తూంటే, ఏ సార్వభౌముడికో వాహనంగా వుండ తగిందిలా కనబడుతున్నది!" అంటూ ఏనుగును మెచ్చుకోసాగారు.

ఈ పొగడ్తలకు రాజు కోపం తెచ్చుకుని, మనసులో, "జనం, రాజైన నాకు చూపవలసిన గౌరవం, యీ ఏనుక్కు చూపుతున్నారన్న మాట! ఒక్కడూ అంబారీలో వున్న నాకేసి కన్నెత్తి చూడడం లేదు. దీన్ని ఏదోవిధంగా పరలోకయాత్ర కట్టించాలి," అనుకున్నాడు.

రాజు మరసటి రోజున మావటివాణ్ణి పిలిపించి, "ఒరే, పట్టపుటేనుగు మంచి శిక్షణగలదేనా?" అని అడిగాడు.

"దానికి శిక్షణ యిచ్చి, అంబారీ ఏనుగుగా తయారు చేసింది నేనే, ప్రభూ!" అన్నాడు మావటివాడు.

"ఏమో, నీ మాటల్లో నాకు నమ్మకం కలగడం లేదు. ఒట్టి పొగరుబోతు ఏనుగని, నా అనుమానం," అన్నాడు రాజు.

"అలాంటిదేం లేదు, ప్రభూ!" అన్నాడు మావటివాడు.

"సరే. నువు చెపుతున్నట్టు, అంత గొప్ప శిక్షణలో పెరిగిన ఏనుగైతే, నువ్వు దాన్ని ఆ కనబడే పర్వత శిఖరానికి ఎక్కించగలవా?" అని అడిగాడు రాజు.

"ఎక్కించగలను, మహాప్రభూ!" అని మావటివాడు, పట్టపుటేనుగును క్షణాల మీద పర్వత శిఖరానికి ఎక్కించాడు.

రాజు కొంత పరివారాన్ని వెంటపెట్టు కుని, ఏనుగు వెనగ్గా కొండ ఎక్కాడు. శిఖరం ఒకచోట బల్లపరుపుగా కొంత దూరం పోయి, కోసుగా కొనతేరి వున్నది. రాజు ఏనుగును అక్కడ ఆపమని మావ టికి చెప్పాడు.

"నువ్వు, దానికిచ్చిన శిక్షణ ఏపాటిదో చూస్తాను. ఏనుగును మూడుకాళ్ళపైన నిలబెట్టగలవా?" అన్నాడు రాజు.

వెంటనే మావటివాడు ఏనుగు తలను అంకుశంతో తాకి సైగచేసి, "బాబా! ప్రభువులవారి ఆజ్ఞ అయింది. మూడు కాళ్ళ మీద నిలబడు!" అన్నాడు.

ఏనుగు అలాగే చేసింది.

రాజు, "ఆహా, బావుంది!" అని, "ఈసారి ముందరి రెండు కాళ్ల మీదా నిలబడగలదేమో చూడు," అన్నాడు.

మావటివాడు సైగ చేయగానే ఏనుగు ముందు కాళ్ళ మీద నిలబడింది.

"ఇదీ, బాగానే వున్నది. ఇప్పుడు వెనక కాళ్ళ మీద నిలబడగలదేమో ఆజ్ఞా



పించిచూడు,'' అన్నాడు రాజు, ఏనుగు కేసి కోపంగా చూస్తూ.

వెంటనే ఏనుగు వెనకకాళ్ళ మీద నిలబడింది. ''ఒంటికాలిమీద నిలుచో గలదా ?'' అన్నాడు రాజు

ఏనుగు సునాయాసంగా ఒంటికాలి మీద నిలబడింది. ఇన్ని తిప్పలు పెట్టినా ఏనుగు పర్వతశిఖరం మీది నుంచి కిందికి పడకపోయేసరికి, రాజు మనసులో కుళ్ళి పోతూ, మావటితో, ''ఇలాంటి పనులు ఏ కొద్దిపాటి శిక్షణగల ఏనుగైనా చెయ్య గలదు. ఇంకొక్క పరీక్ష పెట్ట దలిచాను,'' అన్నాడు.

''అలాగే. ఆ పరీక్ష ఏమిటి, ప్రభూ?'' అని అడిగాడు మావటి.

''ఏనుగు కాళ్ళ ఆధారంతో కొండ మీద నడిచినట్టే, గాలిలో కూడా నడిచేలా చెయ్యి. ఇది, నా ఆజ్ఞ!'' అన్నాడు రాజు.

ఆసరికి రాజు దురుద్దేశం మావటివాడికి అర్థమైంది. కాని, అతడు ఏమాత్రం బెంబేలుపడిపోకుండా ఏనుగు చెవిలో రహస్యంగా యిలా అన్నాడు: ''బాబా! నువు, యీ కొండ శిఖరం నుంచి కింద పడి మరణించాలని రాజు పథకం వేశాడు. అతడు నీ విలువ తెలియనివాడు. నీకు నిజంగా శక్తే వున్నట్టయితే, యీ శిఖరం కొస నుంచి ముందుకుపోయి, గాలిలో నడువు,'' అన్నాడు.

గొప్ప మహిమా, అద్భుతశక్తులూ గల ఆ ఏనుగు శిఖరం నుంచి ముందుకు



పోయి, అలా గాలిలో తేలియాడుతూ వెళ్ళసాగింది. అప్పుడు మావటివాడు రాజుతో, "ఓ, రాజా! ఈ ఏనుగు సామాన్యమైంది కాదు. మహత్తరమైన దైవాంశగలది. విలువ తెలియని, నీ వంటి వాడికి పట్టపుటేనుగుగా వుండదగింది కాదు. మూర్ఖులు ఇటువంటి ఏనుగులనే కాదు, అమూల్యమైన మరి దేనినైనా పోగొట్టుకుంటారు. మూర్ఖుడు తన అవివేకాన్ని, తనకుతానై పదిమంది ఎదటా చాటుకుంటాడు," అన్నాడు.

ఏనుగు గాలిలో నడుస్తూపోయి, కాశీ రాజ్యం చేరి, అక్కడి రాజుగారి ఉద్యాన వనం మీద ఆకాశంలో నిలిచింది. ఇది చూసిన నగర రులు కోలాహలంగా అక్కడికి చేరారు.

ఈ వార్త రాజుగారికి చేరింది. కాశీ రాజు ఉద్యానవనానికి వచ్చి, ఏనుగు కేసి చేతులు జోడించి, "గజరాజా! నీ రాకతో నా రాజ్యం పవిత్రమైంది. కిందికి దిగిరా ప్రార్థిస్తున్నాను," అన్నాడు.

రాజు యిలా అనగానే ఏనుగురూపంలో వున్న బోధిసత్వుడు పైనుంచి, ఉద్యానంలోకి దిగాడు.

రాజు ప్రశ్నించిన మీదట మావటివాడు జరిగినదంతా చెప్పాడు. అది విన్న కాశీ రాజుకూ, అక్కడ చేరిన ప్రజలకూ చాలా ఆనందం కలిగింది.

రాజు, ఏనుగును చక్కగా అలంకరింపచేసి, ఒక దివ్యసుందరమైన ప్రత్యేక శాలలో దానికి నివాసం ఏర్పరిచాడు. ఆ తర్వాత తన రాజ్యాన్ని మూడు భాగాలుగా చేసి, ఒక భాగం ఏనుగు రూపంలో వున్న బోధిసత్వుడి పోషణ కోసం, రెండవభాగం మావటికీ యిచ్చివేసి, మిగిలిన దాన్ని తన సొంతానికి వుంచుకున్నాడు.

బోధిసత్వుడు కాశీరాజ్యం చేరినది మొదలుగా కాశీరాజు ఐశ్వర్యమూ, సంపదా దినదినాభివృద్ధి కాజొచ్చింది. ఆయన పేరు ప్రఖ్యాతులు దశదిశలా వ్యాపించినై.



# గుణాఢ్యుడు




ఆంధ్ర ప్రాంతాన గల ప్రతిష్ఠాన నగరం సాతవాహన రాజులకు రాజధాని. రాజాస్థానంలోని పండితులలో గుణాఢ్యుడు, శర్వవర్మ అనే వారుండేవారు. ఒకసారి శర్వవర్మ రాజుతో, ఆరు నెలల్లో తానాయనకు సంస్కృతం నేర్ప గలనని చెప్పాడు.

ఈ విషయంలో పండితు లిద్దరూ ఘర్షణ పడి, పందెం వేసుకున్నారు. రాజు ఆరు నెలల్లో సంస్కృతం నేర్వగలిగితే, తాను సంస్కృతంలో రచనలు చేయనన్నాడు గుణాఢ్యుడు. కాని, రాజు దీక్షతో చదివి, విజయం సాధించాడు. గుణాఢ్యుడు ఓడిపోయాడు.







గుణాఢ్యుడు నగరం వదిలి దేశాటన ప్రారంభించాడు. ఆయన కన్యాకుమారి నుంచి హిమాలయాల వరకూ పర్యటన చేసి, పండిత, పామరుల నుంచి అనేక కథలు సేకరించాడు. వాటన్నిటినీ ఆయన పైశాచీభాషలో లిఖించాడు.




చాలా సంవత్సరాల తరవాత గుణాఢ్యుడు ప్రతిష్ఠాన నగరానికి తిరిగి వచ్చాడు. పండితులూ, మిత్రులూ ఆయనకు ఘనస్వాగతం యిచ్చారు. ఆయన బృహత్కథ అనే ఉద్గ్రంథాన్ని రచించాడు. ప్రపంచంలో యిదే ప్రప్రథమ కథా సంకలనం.

గుణాఢ్యుడు తన బృహత్కథను రాజుకు వినిపించసాగాడు. కాని, రాజు పరధ్యానంగా వుంటూ మంత్రులతో ఏవో సమాలోచనలు చేయసాగాడు. గుణాఢ్యుడికి రాజు ప్రవర్తన అవమానకరంగా తోచింది.







ఆయన తన తాళపత్ర గ్రంథాన్ని చుట్ట చుట్టి తీసుకుని సభ నుంచి వెళ్ళిపోయాడు. రాజు యిది గమనించలేదు. సభాసదులు కూడా గుణాఢ్యుణ్ణి ఆపేందుకు ప్రయత్నించలేదు.




గుణాఢ్యుడికి కలిగిన ఆవేదన అంతా యింతా కాదు. ఆయన నగర సమీపంలోని ఒక కొండ మీదికి పోయి, అగ్ని రగిల్చి, ఒక్కొక్క తాళపత్రాన్నీ అందులో వేయసాగాడు. ఈ విధంగా ఆయన పడిన శ్రమా, చేసిన ఉత్కృష్ట రచనా మంటలపాలు కాసాగింది.

ఆ సమయంలో పశుపక్ష్యాదులు, ఆయన చేస్తున్న పని చూసి కన్నీళ్ళు కార్చినవట; వృక్షాలు దుఃఖభారంతో తలలు వంచినవట! కాని, గుణాఢ్యుడు యివేమీ గమనించకుండా తన రచనను అగ్నికి ఆహుతి చేస్తూనే వున్నాడు.







ఆ సమయంలో రాజాస్థానోద్యోగి ఒకడు ఆ దారి వెంట పోతూ, గుణాఢ్యుణ్ణి చూశాడు. అతడు పరుగు, పరుగున రాజు దగ్గిరకు పోయి, గుణాఢ్యుడు చేస్తున్న పని గురించి చెప్పాడు. రాజు తన పొరబాటు గుర్తించి బాధపడ్డాడు.




ఆయన వెంటనే గుర్రం మీద గుణాఢ్యుడున్న చోటుకు బయలుదేరాడు. మంత్రులూ, యితర రాజోద్యోగులూ ఆయనను అనుసరించారు.

రాజు, గుణాఢ్యుణ్ణి సమీపించి, “మహా పండితులైన తమరు, నన్ను క్షమించి, తమ అమూల్య రచనను మంటలపాలు చేయకండి!” అన్నాడు. కాని అప్పటికి గ్రంథంలోని ఐదవ వంతు మాత్రం మిగిలి వున్నది. రాజు ఆ తాళపత్రాలను తీసుకున్నాడు.







ఆ తరవాత గుణాఢ్యుడికి ఎనలేని రాజ సన్మానాలు జరిగినై. ఆయన పూర్తి రచన మాత్రం లభ్యం కాకుండా పోయింది. పైశాచీభాష కూడా మరుగున పడింది. కాని, అగ్నిపాలు కాకుండా మిగిలిన బృహత్కథను కొన్ని శతాబ్దాల తరవాత సోమదేవు డనే పండితుడు కథాసరిత్సాగరం అన్న పేరుతో సంస్కృతభాషలోకి అనువదించాడు.

# అప్పు తెచ్చే తెలివి

సూర్యాపురం జమీందారుగారు ఒకనాడు గోష్ఠిలో వుండగా పొరుగూరి మల్లయ్య వచ్చి, తన కుమార్తె వివాహానికి మూడువేల రూపాయలు అప్పు ఇయ్యమని అర్థించాడు.

"ఈ మాత్రం అప్పు మీ ఊళ్ళో పుట్టించే శక్తి నీకు లేదన్న మాట!" అన్నాడు జమీందారు.

"పరమలోభి నుంచి కూడా అప్పుపుట్టించే శక్తి నా కున్నది. కాని తమ చేతిచలవ గురించి విని ఇంత దూరం వచ్చాను," అన్నాడు మల్లయ్య.

"మా వూరి పోలయ్య నుంచి అప్పు తేగలిగితే, అయిదువేలు చేసే నా కంకణం ఇచ్చేస్తాను," అన్నాడు జమీందారు.

"ఆ కంకణం ఏదో ఇప్పించెయ్యండి. పోలయ్య దగ్గిర అప్పు పుట్టించి, అటు నుంచి అటే వెళ్ళిపోతాను. నన్ను నమ్మకపోతే నా వెంట మీ మనుషులను పంపండి," అన్నాడు మల్లయ్య.

జమీందారు కొంచెం ఆలోచించి మల్లయ్యకు కంకణం ఇచ్చి, అతని వెంట నలుగురు మనుషులను పంపాడు.

మల్లయ్య పోలయ్య వద్ద ఆ కంకణాన్ని తాకట్టు పెట్టి, మూడువేలు అప్పు తీసుకుని, ఆ సంగతి జమీందారుగారికి చెప్పమని, తన వెంటవచ్చిన వారితో చెప్పి, తన దారిన తాను వెళ్ళాడు.

—జొన్నలగడ్డ రామలక్ష్మి






# వడ్డీవ్యాపారం

విజయనగరంలో రామయ్య అనే వడ్డీ వ్యాపారి వుండేవాడు. ఆయన తన వ్యాపారాన్ని ఎంతో మెలకువగా నిర్వహించేవాడు. ఒకనాడు ఆయన తన కొడుకు వెంకయ్యతో, "నాకు వృద్ధాప్యం వచ్చేసింది. ఒకసారి తీర్థయాత్రలు చేసి రావాలనుకుంటున్నాను. ఇకనుంచి వ్యాపారం నువే స్వయంగా నిర్వహించవలసి వుంటుంది," అన్నాడు.

తండ్రి చెప్పినదానికి వెంకయ్య సరేనన్నాడు. రామయ్య తన ప్రయాణానికి అవసరం అయిన ఏర్పాట్లన్నీ చేసుకుని, కొడుకుకు కొన్ని వ్యాపార రహస్యాలు చెప్పి, "అనుభవం మీద వ్యాపారంలోని యితరత్రా కిటుకులు నువ్వే గ్రహిస్తావు. ఏవైనా అనుమానాలు కలిగినప్పుడు, పాత ఖాతా పుస్తకాలు చూస్తూండు," అని సలహా యిచ్చాడు.

తండ్రి తీర్థయాత్రలకు వెళ్ళాక, వెంకయ్య అతి జాగ్రత్తగా వ్యాపార విషయాలు చూసుకోసాగాడు. ఒకరోజున నగరంలో చిన్న పళ్ళవ్యాపారి ఒకడు వెంకయ్య దగ్గిరకు వచ్చి, "బాబూ, నాకు అవసరంగా నాలుగు వేల వరహాలు కావాలి. పత్రంరాయించుకుని ఇవ్వండి," అన్నాడు.

"మీ వ్యాపారం ఏమిటి?" అని అడిగాడు వెంకయ్య.

"పళ్ళవ్యాపారం," అన్నాడు వ్యాపారి.

"కొనుగోలు, అమ్మకాల ద్వారా ప్రతి దినం మీ చేతిలో ఏపాటి ధనం ఆడుతూంటుంది?" అన్నాడు వెంకయ్య.

"యాభై వరహాలకు తక్కువుండదు, బాబూ. అవతల సరుకు దిగింది, విడిపించుకోవాలి. కాస్త త్వరగా డబ్బిప్పించండి," అంటూ పళ్ళవ్యాపారి తొందరచేశాడు.

మల్లాది వెంకటకృష్ణమూర్తి

వెంకయ్యకు ఒక అనుమానం కలిగింది. రోజుకు ఏభై వరహాల చొప్పున, నెలకు పదిహేను వందల వరహాలకు మించి వ్యాపారం చెయ్యలేనివాడు, నాలుగు వేల వరహాలు అప్పు చెల్లించగలగడం అసాధ్యం అని తోచింది.

''నాలుగు వేల వరహాలు యివ్వడం కుదరదు. వెయ్యి వరహాలు యిస్తాను, యిష్టమైతే తీసుకుపొండి,'' అన్నాడు వెంకయ్య.

ఆ జవాబుకు పళ్ళవ్యాపారి ఆశ్చర్యపోతూ, ''అదేమిటి, బాబూ! మీ నాన్నగారు నాకు ఆరువేల వరహాల వరకూ అప్పు యిచ్చిన సందర్భాలున్నాయి,'' అన్నాడు.

ఇంతలో ఒక వజ్రాలవ్యాపారి అక్కడికి వచ్చి, వెంకయ్యను ఎగాదిగా చూస్తూ, ''నాకు పదివేల వరహాలు కావాలి,'' అన్నాడు దర్పంగా.

ఆ వజ్రాలవ్యాపారికి పెద్దబజారులో, లక్ష వరహాలకు మించి విలువచేసే దుకాణం వున్నదని, వెంకయ్యకు తెలుసు. అతడు మారుమాట్లాడకుండా వజ్రాల వ్యాపారికి అడిగిన మొత్తం యిచ్చి, పళ్ళవ్యాపారికి మాత్రం ఎంతబతిమాలినా వెయ్యి వరహాలకు మించి యివ్వలేదు.

ఆ తరవాత నెలనెలా పళ్ళవ్యాపారి ఎంతో కొంత మొత్తం తీసుకువచ్చి, తన అప్పు ఖాతాలో జమ వేయించసాగాడు. కాని, వజ్రాలవ్యాపారి మాత్రం నాలుగు



నెలలు గడిచినా ముఖమైనా చూపలేదు. డబ్బు కోసం కబురు చేస్తే, సరైన సమాధానం కూడా యివ్వకుండా, వచ్చిన మనిషిని పంపేశాడు. ఈ లోపల పళ్ళ వ్యాపారి తన బాకీలో సగం చెల్లు వేశాడు.

రామయ్య తీర్థయాత్రల నుంచి తిరిగి వచ్చి, ఒకరోజున ఖాతాపుస్తకాలు తిరగ వేస్తూండగా, అతడికి వెంకయ్య వజ్రాల వ్యాపారికీ, పళ్ళవ్యాపారికీ యిచ్చిన అప్పు కనబడింది.

ఆయన కొడుకును పిలిచి, "వజ్రాల వ్యాపారికి అంత పెద్ద మొత్తం—పదివేల వరహాలు ఎందుకు అప్పు యిచ్చావు?" అని ప్రశ్నించాడు.

వెంకయ్య తప్పు చేసినవాడిలా ముఖం పెట్టి, "డబ్బున్నవాడు. అప్పు తీర్చగల స్తోమతు వున్నదని నమ్మి, యిచ్చాను. ఈ నాటివరకూ దమ్మిడీ చెల్లు వెయ్య లేదు," అన్నాడు.

"నేను తీర్థయాత్రకు వెళ్ళే సమయంలో నీకు వ్యాపార రహస్యాలు కొన్ని చెప్పాను. మన వడ్డీవ్యాపారంలోని ముఖ్యమైన విషయం ఒకటి చెప్ప మరిచినట్టుంది! మనం అప్పు యిచ్చేప్పుడు, తీసుకునే మనిషి ఆర్థికస్తోమతుకన్నా, ముఖ్యంగా చూడవలసింది; అతడిలో అప్పు త్వరగా తీర్చివేయాలనే తపన వున్నదా లేదా అని. అలాంటివాళ్లకు మనం స్తోమతుకు మించి అప్పుపెట్టినా, నమ్మకంగా తీర్చేస్తారు. వజ్రాల వ్యాపారికి డబ్బుంది కాని, నిజాయితీ లేదు," అన్నాడు రామయ్య.

ఆ తరవాత కొద్దిరోజులకే వెంకయ్యకు ఒక పెళ్లి సంబంధం వచ్చింది. రామయ్య, వజ్రాలవ్యాపారి దుకాణానికి పోయి, తను కోడలికి పెట్టదలచిన నగలు కొన్నాడు. వాటి విలువ తను వ్యాపారికి యిచ్చిన పదివేల వరహాల అప్పు, దాని వడ్డీ సరిపోయేలా చూసి, ఖాతాలో జమ వేశాడు.

ఈ అనుభవంతో వెంకయ్య, తండ్రి వ్యాపారాన్ని ఎంతో చాకచక్యంగా నడపగలిగాడు.



# చాట-జల్లెడ

శృంగేరిదేశపు రాజు ఆస్థానంలో ఒక ఉన్నతోద్యోగి స్థానం ఖాళీపడింది. రాజు అలాంటి స్థానాలకు కొత్తవాళ్ళను నియమించవలసి వచ్చినప్పుడు, వాళ్ళను తన గురువు చేత పరీక్ష చేయించేవాడు.

ఈ ఉద్యోగం కోసం వచ్చిన రామశాస్త్రినీ, గోపాలశాస్త్రినీ రాజు, తన గురువు వద్దకు పంపాడు. గురువు తాను పరీక్ష చేసిన వాళ్ళకు, ఏదో ఒక వస్తువు యిచ్చి రాజు దగ్గిరకు పంపడం మామూలు. ఆ వస్తువును బట్టి, అది తెచ్చిన వ్యక్తి స్వభావాన్ని రాజు అర్థం చేసుకోగలిగేవాడు.

ఈసారి గురువు దగ్గిరకు పరీక్ష కోసం పోయిన రామశాస్త్రి ఒక చాట తోనూ, గోపాలశాస్త్రి ఒక జల్లెడ తోనూ తిరిగి వచ్చారు.

రాజు ఎంత ఆలోచించీ, గురువు చెప్పదలిచినదేమిటో అర్థంకాక ఆ పని తన ఆస్థాన పురోహితుడికి ఒప్పజెప్పాడు. పురోహితుడికూ్కడా ఎంత ఆలోచించినా గురువు అభిప్రాయం అర్థం కాలేదు. అతడు అలా ఆలోచిస్తూ ఇంటికిపోయే సరికి, భార్య దంచిన వడ్లను చాటతో చెరగడమూ, ఏదో పిండిని జల్లెడ పట్టడమూ అతడి కంటబడింది.

పురోహితుడు మర్నాడు రాజుతో, "మహారాజా, గురువుగారి ఉద్దేశం యిది! రామశాస్త్రి చాట లాగా ఉపయోగమైనదాన్ని ఉంచుకుని, నిరుపయోగమైనదాన్ని తోసివేయగల వివేకి. గోపాలశాస్త్రి అలా కాక, జల్లెడ మాదిరి ఉపయోగమైనదాన్ని వదిలేసి, పనికిరాని దాన్ని అట్టేపెట్టుకునే మందమతి," అని చెప్పాడు.

రాజు, రామశాస్త్రిని ఖాళీపడిన ఉన్నతోద్యోగంలో అప్పటికప్పుడే నియమించాడు.

—కోలార్ కృష్ణఅయ్యర్






# దయ్యంభ్రాంతి

కాళిందీ నదీతీరాన పుంజిక అనే గ్రామంలో ప్రజ్ఞావంతుడు అనే బ్రాహ్మణు డుండేవాడు. పేరు గొప్పేగాని ఆ బ్రాహ్మడు ఎందుకూ పనికిరాని దౌర్భాగ్యుడు. కాకి ముక్కుకు దొండపండు కట్టినట్టుగా అ పనికిమాలినవాడికి సులోచన అనే పిల్లనిచ్చి వివాహం చెయ్యటానికి నిశ్చయిం చారు. సులోచన రంభలాటి పిల్ల. అయితే అమె తల్లిదండ్రులు, ప్రజ్ఞావంతుడు ఎరిగినవాడనీ, పిల్ల ఊళ్లోనే ఉంటుందనీ ఆలోచించి సంబంధం నిశ్చయించారు.

ముహూర్తం నిశ్చయమయింది. సులో చనను పెళ్ళికూతుర్ని చేశారు. ఆమెకు ఈ పెళ్ళి ఎంతమాత్రం ఇష్టం లేదు. కాని తన మొర ఆలకించేవారు లేరు. అందుచేత ఆమె ఆత్మహత్య చేసుకోవ టానికి నిశ్చయించింది. పెళ్ళినాడు ఉదయం మసకచీకట్లో ఆమె బిందె చంకన పెట్టుకుని కాళిందీనదికి వెళ్లింది. బిందె ఒడ్డున పెట్టి, నదిలోకి ఉరక బోతుండగా వెనక నుంచి ఎవరో ఆమెను పట్టుకున్నారు.

సులోచనను ఆ విధంగా ఆత్మహత్య చేసుకోకుండా ఆపినవాడు విత్తకర్మ అనే యువకుడు. అతడు దక్షిణాన కుంభ కోణం నగరంలో వ్యాపారం చేస్తూ అక్కడే వుండిపోయాడు. అతను పెళ్ళి చేసుకునే ఉద్దేశంతో స్వదేశానికి వచ్చాడు. చాలామంది కన్యలను చూశాడు. కాని అతనికి ఒక్కరూ నచ్చలేదు. ఇంకా ఇతర గ్రామాలలో చూతామని అతను గుర్రం మీద నది వెంబడి వస్తూ దూరం నుంచే సులోచనను చూసి ఆగి గుర్రం దిగి ఆమెను సమీపించాడు. ఆమె వెనక్కు తిరిగి చూసుకుంటూ రావడం అతనికి అనుమానం కలిగించింది. అతను

అలా అనుమానించబట్టే దేవుడల్లే అడ్డు పడి ఆమె ప్రాణం రక్షించగలిగాడు.

"పెళ్ళికూతురి వేషంలో వుండి ఇదేం పని? నువ్వెవరవు?" అని విత్తకర్మ సులోచనను అడిగాడు.

ఆమె దాచకుండా జరిగినదంతా చెప్పి, "అలాటి భర్తను చేసుకునేకన్న చచ్చి పోవటం మంచిదనిపించింది. మీరు సమయానికి వచ్చి నా ప్రయత్నం కాస్తా పాడు చేశారు," అంటూ కంటనీరు పెట్టుకున్నది.

"మంచిపనే జరిగింది! నా వెంట వస్తావా? నేనూ కన్యకోసమే తిరుగుతున్నాను. ఎందరినో చూశాను గాని, నీ వంటి అందగత్తె నాకు కనిపించలేదు. దక్షిణదేశంలో మీ వాళ్ళకు దూరంగా ఉండటం అభ్యంతరం లేకపోతే నిన్ను తీసుకుపోయి పెళ్ళాడతాను!" అన్నాడు విత్తకర్మ.

"ఆత్మహత్య చేసుకుందామనుకున్నప్పుడే నేను అందరినీ వదిలేశాను. వారు నాకు చేసిన మేలేమిటి? నన్ను చావనిచ్చారుకారు గనక ఇక నన్ను మీరే భరించి, భార్యను చేసుకోండి!" అన్నది సులోచన దీనంగా.

విత్తకర్మ ఆమెను తన గుర్రం మీద ఎక్కించుకుని తెల్లవారే లోపునే మూడు



గ్రామాలు దాటి నేరుగా కుంభకోణానికి వెళ్ళిపోయాడు.

వారిద్దరూ బయలుదేరిన కొంత సేపటికి ఊళ్ళోవాళ్ళు కొందరు రేవుకు వచ్చి ఒడ్డున ఉన్న బిందెను చూశారు. ఎవరో ఏట్లో పడిపోయారని ఊరంతా చెప్పారు. బిందెనుబట్టీ, సులోచన ఎక్కడా కనిపించకపోవటాన్నిబట్టీ, పెళ్లికూతురే ఏటికి ఎర అయిందని రూఢి అయిపోయింది.

పెళ్లికని వచ్చిన దూరపు బంధువులంతా తలా ఒకరకంగా సులోచన చావును గురించి ఆశ్చర్యంగా చెప్పుకుని, ఎవరి దారిన వాళ్ళు వెళ్ళారు.

ఎటువంటి అప్రయోజకుడికైనా చేసుకుంటానంటే పిల్ల దొరక్కపోదు. కొంత కాలం గడిచాక రాధ అనే పొరుగూరి పిల్లను ప్రజ్ఞావంతుడి కిచ్చి పెళ్ళి చేశారు. ఆమె కాపరానికి వచ్చి గర్భవతి కూడా అయింది.

గర్భవతులకు ఆరోగ్యం సరిగా వుండదు. రాధకు వేవిళ్ళు చాలా తీవ్రంగా వచ్చాయి. ఆమె భయపడసాగింది. దానికి తగినట్టే అమ్మలక్కలు చేరి, "పిచ్చిదానా, గర్భిణిగా వుండి ఆ రేవు కెందుకు వెళ్ళావు? సులోచన అక్కడ దయ్యమై తిరుగుతున్నదని నీకు తెలీదా? పెళ్ళి కాబోయే క్షణంలో బలవంతపు చావు చచ్చింది. దానికి కాబోయే మొగుణ్ణి చేసుకున్నావు గనక నిన్ను పీడించి తీరుతుంది!" అని రాధకు పిరికిమందు పోశారు.

రాధకేగాక కడుపులో వుండే బిడ్డకు కూడా అపాయం జరుగుతుందేమోనని ప్రజ్ఞావంతుడు అంజనాలు వేయించాడు, సోదె అడిగించాడు. ఎంతమందిని అడిగినా, అందరూ సులోచన దయ్యమై పట్టిందని చెప్పేవాళ్ళే! ప్రజ్ఞావంతుడికి దయ్యంలో బాగా నమ్మకం కుదిరింది. అతను చుట్టుపక్కల వుండే భూత వైద్యులనూ, మాంత్రికులనూ రప్పించి, ముగ్గులు వేయించి, మంత్రాలు చదివించి, తన భార్యకు తాయెత్తులు కట్టించాడు. ఒకరి తరవాత ఒకరుగా నలుగురు



మాంత్రికులు దయ్యాన్ని భూస్థాపితం చేశారు. క్రమంగా రాధ ఆరోగ్యం బాగు పడినట్టు కనిపించింది. దయ్యం వదిలిం దనుకున్నారు.

కాని, రాధ కొద్దికాలానికే ఒక బిడ్డను కనగా, పుట్టిన కొద్ది గడియలకే ఆ బిడ్డ మరణించింది. అది దయ్యం పనే అని అందరూ అనుకున్నారు. "ఎంతమంది ఎన్ని మంత్రాలు చదివి ఏం లాభం? ఈ క్షుద్రోపాసకుల వల్ల దయ్యం వదలదు. ఏవైనా తీర్థయాత్రలు చేసిరా!" అని కొందరు ఊరిపెద్దలు ప్రజ్ఞావంతుడికి సలహా ఇచ్చారు.

"రామేశ్వరానికి వెళ్ళటం మంచిది. ఒకడికి ఇలాగే దయ్యం పడితే రామేశ్వ రానికి పోయిరాగానే వదిలింది," అన్నారు ఒకరు.

ప్రజ్ఞావంతుడు తన భార్యను వెంట బెట్టుకుని రామేశ్వరం వెళ్ళటానికి నిశ్చ యించాడు. మంచి ముహూర్తం చూసి ఇద్దరూ బయలుదేరారు. వారు చాలా రోజులు ప్రయాణం సాగించి ఒకనాడు కుంభకోణం చేరుకుని ఒక సత్రంలో బస చేశారు. ఆ రాత్రి ఎవరో దొంగలు వారి మూటా ముల్లే ఎత్తుకుపోయారు.

ఈ దొంగతనం మూలంగా ప్రజ్ఞా వంతుడూ, రాధా కట్టుబట్టలతో మిగిలారు. ముందుకు వెళ్ళటానికి లేదు, వెనక్కు పోవటానికి లేదు. వారి దుస్థితి చూసి అక్కడివాళ్ళు, "జరిగినదానికి విచారించ



కండి. ఈ ఊళ్ళో దానకర్ణుడు లాంటి వర్తకు డొకాయన, మీ ప్రాంతం వాడే ఉన్నాడు. ఆయన దగ్గిరికి వెళ్ళి జరిగిన సంగతి చెప్పుకున్నారంటే మీ ప్రయాణానికి అవసరమైన అన్ని సదుపాయాలూ చేస్తాడు!'' అని సలహా ఇచ్చారు.

ఆ వర్తకుడి ఇల్లు ఎక్కడ ఉన్నదీ గుర్తు తెలుసుకుని ప్రజ్ఞావంతుడు భార్యతో సహా అక్కడికి వెళ్లాడు. భర్త వర్తకుడితో మాట్లాడే సమయంలో రాధ వర్తకుడి భార్యవద్దకు పోయి, తనకు సులోచన ఎలా దయ్యమై పట్టింది, ఆ దయ్యాన్ని వదిలించటానికి తాము ఎలా రామేశ్వర యాత్ర బయలుదేరిందీ, తమ సొత్తు దొంగలు ఎలా అపహరించిందీ వివరంగా చెప్పుకున్నది.

అంతా విని ఆ వర్తకుడి భార్య తన ఒంటిన ఉన్న నగలన్నీ తీసివేసి, మామూలు చీర ధరించి, తన భర్తతో మాట్లాడుతున్న ప్రజ్ఞావంతుణ్ణి తనవద్దకు తీసుకురమ్మని నౌకరును పంపించింది. ప్రజ్ఞావంతుడు వచ్చాడు, కాని వర్తకుడి భార్య కేసి చూడలేదు.

''ఏమయ్యా, నన్నెప్పుడన్నా చూసిన జ్ఞాపకం ఉందా?'' అని అడిగింది వర్తకుడి భార్య.

ప్రజ్ఞావంతుడామె కేసి కొంచెం సేపు చూసి, సులోచన అని గుర్తించి, నోట మాట రాక రాతి బొమ్మ లాగా నిలబడి పోయాడు.

సులోచన రాధ కేసి తిరిగి, ''చూశావా, అమ్మా? నేను దయ్యమై పట్టాననే భ్రమతోనే మీరు ఇన్ని తిప్పలూ పడుతున్నారు. దయ్యమంటే భ్రమేనని ఇప్పటికైనా తెలుసుకుని, యింటికి పోయి సుఖంగా ఉండండి,'' అంటూ ఆ దంపతులకు తన వృత్తాంతమంతా తెలియజేసింది.

ప్రజ్ఞావంతుడూ, రాధా రెండు రోజుల పాటు సులోచన ఇంట అతిథులుగా వుండి, ఆమెవద్ద తిరుగు ప్రయాణానికి డబ్బు తీసుకుని తమ గ్రామానికి వెళ్ళిపోయారు.





# దురాశ దుఃఖం చేటు

జానకమ్మ ఇంటి వీధి తలుపు తెరిచి ఉండడం చూసి, అటుగా పరిగెత్తుకు వస్తున్న ఒక దొంగ చప్పున లోపలికి వచ్చి, తలుపు గడియ పెట్టి, జానకమ్మ కేసి వచ్చాడు. దొంగను చూసి జానకమ్మ అరవబోయింది.

"అరిచావంటే చస్తావు! నేను నీ ఇంట దోచుకోవటానికి రాలేదు. బజార్లో ఒక మనిషి చేతిలో కంచిపట్టుజరీ చీర లాక్కుని పారిపోతుంటే, ఆ మనిషి వెంట పడ్డాడు. ఆ మనిషికి అందకుండా పారి పోయివచ్చాను," అన్నాడు దొంగ.

కంచిపట్టు చీర అనగానే జానకమ్మకు ఎక్కడలేని కుతూహలమూ వచ్చి, "ఏదీ చీరను చూడనీ!" అన్నది.

దొంగ తన చేతి సంచిలో ఉన్న పట్టు చీర తీసి జానకమ్మకు చూపించి, తిరిగి సంచిలో పెట్టుకున్నాడు.

"ఇలాంటి చీర తెచ్చిపెట్టమని మా వార్ని ఎంత కాలంగానో అడుగుతున్నాను. నిన్న చివరకు ఆయనతో తగాదా కూడా పెట్టుకున్నాను 'కంచి పట్టుచీర అంటే మాటలా? అంత డబ్బు ఎక్కణ్ణుంచి తీసుకురాను?' అని కసురుకున్నారు. నీ దగ్గిరున్న చీర నువ్వు ఎలాగూ డబ్బు పోసి కొన్నది కాదు గనక నాకు అమ్మెయ్యి. దొంగసొత్తుకు ఒక ధరఏమిటి? రెండు వందల రూపాయలిస్తాను. అవి తీసుకుని, చీర ఇచ్చి వెళ్ళు. ఎవరు నీ వెంట పడ్డా భయం ఉండదు," అన్నది జానకమ్మ.

"సరే! డబ్బు తీసుకురా!" అన్నాడు దొంగ ఇంతలో వీధి తలుపు ఎవరో తట్టిన చప్పుడయింది. దొంగ వెంటనే సంచితో సహా అటక ఎక్కి కూర్చున్నాడు.

జానకమ్మ వెళ్ళి తలుపు తెరిచింది. బయట రక్షక భటులు కనిపించి,

"అమ్మా, ఒక దొంగ వీధిలో ఎవరి చేతి నుంచో కంచి పట్టుచీర లాగేసుకుని పారి పోయాడు. ఆ దొంగ ఇటుగా ఏమైనా వచ్చాడా?" అని ఆమెను అడిగారు.

జానకమ్మ శీఘ్రంగా ఆలోచించుకున్నది. దొంగను ఈ రక్షకభటులకు పట్టి ఇస్తే తనకేం ఒరుగుతుంది? వెయ్యి రూపాయలు పోస్తేగాని రాని పట్టుచీరను దొంగ తనకు రెండు వందలకే ఇస్తానంటున్నాడు. ఇలా అనుకుని ఆమె, "ఇటువేపు ఎవరూ రాలేదు, నాయనా!" అన్నది. రక్షకభటులు వెళ్ళిపోయారు.

జానకమ్మ లోపలికి వెళ్లి, దొంగను అటక దిగమని, తాను దాచుకున్న రెండు వందలూ దొంగకు ఇచ్చి, చీర ఇయ్యమన్నది. దొంగ డబ్బును సంచిలో పెట్టుకుని, జానకమ్మకు చీర ఇవ్వక, ఆమెను ఒక్క తోపు తోసి, పారిపోయాడు.

హఠాత్తుగా జరిగిన ఈ సంఘటనకు జానకమ్మ నివ్వెరపోయి, దొంగసొత్తుకు ఆశపడినందుకూ, దొంగకు రక్షణ ఇచ్చినందుకూ తనకు తగిన శిక్షే జరిగిందని తెలుసుకున్నది.

ఇంతలో ఆమె భర్త వెంకటరంగం ఇంటికి తిరిగి వచ్చి ఇలా అన్నాడు:

"ఒసే, నువు దురదృష్టవంతురాలివి! ఎన్నాళ్ళనుంచో కంచి పట్టుచీర కొని పెట్టమని అడుగుతున్నావుగదా! దాన్ని గురించి ఇద్దరమూ పోట్లాడుకున్నాం కూడా. పోనీ అని, ఒక స్నేహితుడి దగ్గిర వెయ్యి రూపాయలు అప్పు చేసి, కంచి పట్టు చీర కొని, బజారులోకి వచ్చానో లేదో, ఎవడో దొంగవెధవ దాన్ని లాక్కుని, పారిపోసాగాడు. వెయ్యి రూపాయల చీర దొంగపాలు చెయ్యడం ఇష్టం లేక, వాడి వెంట పడ్డాను. కాని వాడు నా కంటపడకుండా ఎటో జారుకున్నాడు. వెంటనే వెళ్లి, రక్షకభటులకు ఫిర్యాదు చేశాను. దొంగ దొరుకుతాడన్న నమ్మకం లేదు."

ఈ కథ విన్న జానకమ్మకు తనకు జరిగిన శిక్ష పూర్తి స్వరూపం తెలిసి వచ్చింది.





# విఘ్నేశ్వరుడు

ఒకనాడు నారదుడు కైలాసానికి వెళుతున్న దారిలో కంటకముఖి అనే ఒక యక్షిణి పరిహాసంగా, "నన్ను పెళ్లాడవయ్యా, నారదా! బ్రహ్మ చెర తప్పించుకోవయ్యా, బ్రహ్మకొడుకా!" అని అన్నది.

నారదుడు, "నేను కలహభోజనుడిని. కలహం వండిపెట్టగలది దొరకాలి గదా!" అన్నాడు.

"నేను, నీ కంటే జగడాలమారిని!" అంది యక్షిత.

ఆ సమయంలో విఘ్నేశ్వరుడూ, కుమారస్వామీ చెట్టాపట్టాలేసుకొని వస్తున్నారు. నారదుడు, "ఆ వస్తున్న అన్నతమ్ముళ్ళ మధ్య జగడం తేగలవా?" అన్నాడు.

"ఓష్! అదెంత!" అని కంటకముఖి పక్కనున్న దళసరోవరం లోకి దూకి బంగారు తామరపువ్వుగా మారి, "పార్వతీ పరమేశ్వరుల సుపుత్రుడి కోసం వికసించాను," అంటూ కిన్నెర మీటుతున్నట్లు పాట మొదలు పెట్టింది.

అన్నదమ్ములిద్దరూ దాన్ని పట్టుకొని నాది, నాది అని వాదులాడుతూ, "అమ్మ చేసిన బొమ్మవు నీవు, మురికి ముద్దవు!" అని కుమారస్వామి విఘ్నేశ్వరుణ్ణి ఆక్షేపిస్తే, "నువ్వు మురికిగుంట శరవణ శరస్సులోంచి వచ్చావు!" అని విఘ్నేశ్వరుడు కుమారస్వామిని ఎత్తిపొడిచాడు.

కుమారస్వామి పిడికిలి బిగించి పొడవబోయాడు. విఘ్నేశ్వరుడు తొండంతో

7. వేయి విఘ్నాలు



అతనిచేతి మణికట్టు బిగించాడు. ఇద్దరూ కలబడ్డారు. వినాయకుడు కుమారస్వామి నడుము తొండంతో బిగించి పైకెత్తాడు. కుమారస్వామి పైనుంచి బళ్ళాన్ని విఘ్నేశ్వరుడి బొజ్జకు గురిపెట్టాడు.

నారదుడు పరుగు పరుగున వచ్చి వారి కలహాన్ని నివారించి, "మీరిద్దరూ ఏదేనా పందెం పెట్టుకోండి," అన్నాడు.

కుమారస్వామి ఆలోచించి, "ఎవరు విశ్వాన్ని చుట్టి ముందువస్తే వారిదీ స్వర్ణకమలం!" అన్నాడు.

"బాగుంది,!" అన్నాడు నారదుడు.

కుమారస్వామి వెంటనే నెమలి మీద విశ్వప్రదక్షిణానికి ఎగిరివెళ్ళాడు.

విఘ్నేశ్వరుడు చతికిలబడి నిట్టూర్చగా నారదుడు, "ఏం విఘ్నేశా! నీ సంగతేమిటి?" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "ఎవరికెంత ప్రాప్తో అంతేగాని స్వర్ణకమలం నాకు రమ్మంటే వస్తుందా, నారదా! నా బొజ్జతో, చిట్టెలుక వాహనంతో, నే నెక్కడ? విశ్వప్రదక్షిణ ఎక్కడ? తమ్ముణ్ణే తీసుకోనీ కమలం!" అన్నాడు.

నారదుడు, "విఘ్నపతీ! విశ్వజననీ జనకులైన పార్వతీపరమేశ్వరులను దర్శిద్దామని వచ్చాను గానీ మళ్ళా వస్తాను," అని చెప్పి వెళ్ళాడు.

విఘ్నేశ్వరుడు చప్పున లేచి వెళ్ళి, ఒక తిన్నెపైకూర్చున్న పార్వతీశివుల చుట్టూరా ముమ్మారు ప్రదక్షిణ చుట్టి తమ్ముడి రాకకు ఎదురుచూస్తూ నిలబడ్డాడు.

చాలా సేపటికి ముప్పతిప్పలుపడి విశ్వప్రదక్షిణం చేసిన కుమారస్వామి నెమలి వాహనం దిగాడు. విఘ్నేశ్వరుడు తమ్ముణ్ణి కౌగలించుకొని, "తమ్ముడా, పాపం చాలా శ్రమలుపడి విశ్వం చుట్టి వచ్చావు; స్వర్ణకమలం నువ్వే వెళ్ళి తీసుకో. గెలవడం నేనే గెల్చానుగాని, నా కది అక్కర్లేదులే!" అన్నాడు.

కుమారస్వామి నివ్వెరపోతూ, "అదెలాగ?" అన్నాడు.

"నీ కంటే ముందు నేనే ముమ్మారు విశ్వప్రదక్షిణ చేసి నిలబడ్డాను, ఎవర్నడుగుతావో అడుగు!" అన్నాడు విఘ్నేశ్వరుడు.

"విఘ్నేశ్వరుడే గెల్చాడు!" అని ఆకాశవాణి ముమ్మారు పలికింది.

కుమారస్వామి నిజం తెలుసుకొని, వినాయకుడి ముందు మోకరిల్లి, "అన్నా! నేను పెద్ద తపస్సు చేసి బ్రహ్మజ్ఞానం పొందానే కాని, చిన్న విషయంలో అజ్ఞానంలోనే పడ్డాను. నువ్వు కుశాగ్ర బుద్ధివి. నీ ముందు నేను ఎంత, నీ తరువాత వాణ్ణేగద! తారకాసురుడిపై యుద్ధానికి వెళ్తున్నాను, నన్ను ఆశీర్వదించు!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు కుమారస్వామిని లేవదీసి, "తమ్ముడూ! నేను పెద్ద అనీ, నువ్వు చిన్న అనీ అనుకోవద్దు, నీవు కారణ జన్ముడివి! నీవు అన్నట్లుగా అమ్మ ఏదో ఆటగా చేసిన బొమ్మనే నేను; నీ కోసమే పార్వతీశివుల కళ్యాణం జరిగింది. వారి అనురాగఫలానివి! నీకు విజయం ఎప్పుడో రాసిపెట్టే ఉంది. తారకాసురుడు నీ చేతనే చావాలని వరం కోరుకున్నాడు. నీవు సుబ్రహ్మణ్యేశ్వరుడివి! నాకు అన్నిచోట్లా మామూలు గుళ్లు ఉంటాయిగాని, నీకు కొన్ని ప్రాంతాల్లో గొప్ప క్షేత్రాలు, పెద్దపెద్ద



ఆలయాలు, గోపురాలు ఉంటాయి. ప్రముఖ దైవమూర్తిగా ఆరాధింపబడతావు. శీఘ్రంగా వెళ్లి తారకాసురుడి బెడద వదిలించు!" అన్నాడు.

కుమారస్వామి దేవతలకు సేనాధిపతిగా తారకాసురుడిపై దాడి వెళ్ళాడు.

యక్షుల అధిపతి కుబేరుడు కంటకముఖిని పట్టి తెప్పించి, "ఓసీ, మాయల మారి పాపిష్ఠిదానా! శివుడి కుమాళ్ళకే కలహం పెట్టావు, పల్లేరువై పడిఉండు!" అని శపించాడు.

కంటకలత ప్రాధేయపడగా, విఘ్నేశ్వరుడి అనుగ్రహంవల్లనే శాపం తొలగుతుంది అని చెప్పాడు, కుబేరుడు. కంటక




ముఖి పల్లేరు ముళ్ల డొంకగా భూమ్మీద మొలిచింది.

కుమారస్వామి దేవతలకు సేనానాయకుడై తారకాసుర నిర్మూలన చేశాడు. అతనికి దేవేంద్రుని కుమార్తె దేవయానను ఇచ్చి వివాహం జరిపించడానికి సర్వ సన్నాహాలు చేయబడ్డాయి గాని, అన్నకు కానిదే తమ్ముడికెలాగ చేయడం అన్నారు.

పార్వతి విఘ్నేశ్వరుడితో, "ప్రియ నందనా! తమ్ముడి పెళ్ళి జరగాలంటే నువ్వు పెళ్ళి చేసుకోవడం నీ ధర్మం!" అన్నది.

"ఎందుకమ్మా! ఇలాంటి అర్థం లేని నియమాలు? ఎవరి యిష్టానుసారం వారు చేసుకోకుండా తోకతెగిన నక్క సామెతగా నా లాంటి ఏకదంతుల్ని, ఏకాంతుల్ని రొంపిలోకి దింపటం మంచిది అనిపించుకోదు," అన్నాడు విఘ్నేశ్వరుడు తొలి విఘ్నంగా.

విఘ్నేశ్వరుడు యిలా ఎన్నోసాకులూ, విఘ్నాలూ కల్పించుకొంటూ వచ్చాడు.

ఒకసారి చాలా పట్టుదలతో పార్వతి పెళ్లి చేసుకోమని తొందర పెట్టింది. "అమ్మా! నేను తపస్సు చేయాలి! తమ్ముడు చేశాడు గాని నేను చేయలేదుగా," అని విఘ్నేశ్వరుడు తపస్సుకి బయలుదేరాడు.

ఇంద్రుడు అప్సరసలందర్నీ విఘ్నేశ్వరుడి తపోభంగం చేయండని పంపాడు. అర్క అనే అప్సర నిరాకరించింది. ఇంద్రుడు, "నువ్వు మాలకాకివి, అంటరాని జిల్లేడువై భూమ్మీద మొలు!" అని శపించాడు.

విఘ్నేశ్వరుడు తపస్సు చేయడానికి అనువైనచోటు వెతికివెతికి ఎన్నుకున్నాడు. ఆ ప్రదేశంలో పల్లేరుడొంకలు నేలంతా విస్తరించి ఉన్నాయి. జిల్లేడు పొదలు మొగ్గలు నిండుగా తొడిగి విచ్చుకుంటూ వున్నాయి. విఘ్నేశ్వరుడు తపస్సు సాగిస్తున్నాడు. అప్సరసలు అక్కడకు చేరి నాట్యం మొదలుపెట్టారు.

వాళ్ళ కాళ్ళకు పల్లేరుకాయ ముళ్ళు గుచ్చుకొని పడిపోతుంటే ఒంటినిండా పల్లేరుముళ్ళు గుచ్చుకుంటూంటే మూలుగుతూ ఆర్తనాదాలు చేశారు. విఘ్నేశ్వరుడికి ధ్యానభంగమై జరిగింది చూశాడు. పల్లేరుతీగపట్ల అభిమానం కలిగింది. అప్సరసలు భయంతో పడుతూ లేస్తూ కుంటుకుంటూ పారిపోయారు. పల్లేరుగా మొలిచిన యక్షిణి కంటకముఖి, "స్వామీ! మీ అన్నతమ్ముళ్ళకు తగువు పెట్టి కుబేరుడి శాపం పొంది ఇలా పడి ఉన్నాను, అనుగ్రహించు!" అని వేడుకుంది.

ఆ రోజు సరిగా భాద్రపద శుక్ల చవితి, వినాయకచవితి రోజే. విఘ్నేశ్వరుడు కంటకముఖి శాపం తొలగించి, "వినాయకచవితినాడు నీ పల్లేరు ముళ్ళ కాయలను వికటవినోదంగా ఉపయోగిస్తారులే!" అని చెప్పాడు.

యక్షిణి అలకాపురి చేరుకుంది. అప్పుడు జిల్లేడు, "స్వామీ! నన్ను కూడా అనుగ్రహించండి. ఇంద్రుడి ఆజ్ఞ నిరాకరించి శాపం పొంది అంటరానిదాన్నిగా ఇలా పడి ఉన్నాను. నేనెందుకూ కొరగానిదాన్ని, అర్క అనే అప్సరసను, నీయందు భక్తి శ్రద్ధలు గలదాన్ని!" అంది.

విఘ్నేశ్వరుడు జిల్లేడుతో, "అంటరానితనం అంటూ ఏదీ సృష్టిలో లేదు. నీ మొగ్గల్ని, పువ్వుల్ని నేను ప్రీతితో





మాలగా ధరిస్తాను! నీవు ద్వాపర యుగంలో కుబ్జవై పుడతావు. కృష్ణుడు నిన్ను ఏలుకుంటాడు. నీ శాపం పోయింది. సుఖంగా స్వర్గం వెళ్ళు. ఇంద్రుడి వల్ల గాని మరెవ్వరివల్ల గాని నీ కెటువంటి భయమూ ఉండదు, ఏ శాపమూ తగలదు. జిల్లేడు వ్రేళ్ళు ఆయుర్వేద ఔషధాలకు ఉపయోగపడతాయి. జిల్లేడాకులు సూర్యుడికి ప్రీతిగా ఉంటాయి!'' అని చెప్పాడు.

అర్క అప్సరరూపంతో స్వర్గాన్ని చేరుకుంది.

విఘ్నేశ్వరుడు కైలాసానికి తిరిగి వెళ్ళాడు. ''నాయనా, తపస్సు ముగిసింది కదా, మరి పెళ్ళి........'' అని పార్వతి అంటూండగా, ''ముగియడమేమిటి? అసలు జరగనేలేదు, తిరిగి తపస్సు కెళుతున్నా!'' అని చెప్పి విఘ్నేశ్వరుడు మరో చోటు ఎన్నుకున్నాడు. ఆ ప్రదేశమంతా పాములపుట్టలమయంగా ఉంది. చుట్టూ వలయంగా పుట్టలున్నట్టు చూసుకొని తపస్సు మొదలుపెట్టాడు. పుట్టల్లోంచి పాములు నిటారుగా లేచి పడగలు విప్పి బుసలుకొడుతూ కాపలా కాయసాగాయి. ఇంద్రుడు మూషికాసురుడి అనుచరులైన రాక్షసులకు, ''మీ యజమానిని వాహనంగా చేసుకొన్న విఘ్నేశ్వరుడు మిమ్మల్నందర్నీ నిర్మూలించడానికి తపస్సు చేస్తున్నాడు, పగ తీర్చుకోండి!'' అని కబురు పెట్టి ఉసిగొల్పాడు.

రాక్షసులు వినాయకుడి మీద దాడి చేయగా మహాసర్పాలు పాతాళం నుంచి కట్టలుగావచ్చి వాళ్ళ పొగరు అణిచాయి. చచ్చినవాళ్ళు చావగా మిగిలినవాళ్ళు తమ తెలివి తక్కువను నిందించుకొంటూ ఇంద్రుణ్ణి తిడుతూ అక్కడి నుంచి పారిపోయారు.

ఇంద్రుడు మంచి ఉల్లాసవంతులైన దేవతా పురుషుల్ని, వారితో అప్సరసలను కలిపి పంపుతూ, ''విఘ్నేశ్వరుడికి రాగోదయం కలిగేలాగ మీ ప్రతాపం చూపండి!''

అని ఆజ్ఞాపించాడు. వాళ్ళ వెనకనే వజ్రాయుధం పట్టి వెళ్ళాడు.

దేవతలు అప్సరలతో జంటజంటలుగా సురసేవిస్తూ కోలాహలంచేస్తూ ఆటపాటలు మొదలు పెట్టారు, నాగులు బుసకొడుతూ విరుచుకుపడి వాళ్ళను చుట్టుకొని కోరలతో కాట్లువేయసాగాయి. ఇంద్రుడు నాగులపై వజ్రాయుధాన్ని ఝళిపించాడు. నాగుల కోపం రెచ్చిపోయింది. నాగలోకం నుంచి బిలబిలమని మహాసర్పాలన్నీ వచ్చి దేవతల్ని స్వర్గానికి తరిమాయి. దేవతలకూ నాగులకూ చిన్న యుద్ధం లాంటిది జరిగింది. ఇంద్రుడి వజ్రాయుధాన్నే లక్ష్యపెట్టకుండా నాగులు స్వర్గాన్ని ముట్టడించి గగ్గోలు పుట్టించి మరీ వెళ్లాయి. విఘ్నేశ్వరుడు నాగుల సహాయానికి సంతసించి పాములను ఎత్తుకొని ముద్దాడి, అలంకారాల్లాగ మీద వేసుకొని కైలాసానికి వెళ్ళాడు.

పార్వతి అతని పాములవాడి వాలకం చూసి నివ్వెరపోయింధి.

"అమ్మా! తండ్రి సొత్తు తనయుడికి సంక్రమించడం సహజమైందేగదా! శంకరాభరణాలు నాకు భూషణాలే! అదీగాక పాములు నాకు ప్రాణమిత్రులై ప్రాణాలకు తెగించి కాపుకాశాయి. ఆప్తమిత్రుల అండదండలే కదా నిజమైన దండకడియాలూ, అమూల్యాభరణాలూను! అందుకే నాగభూషాయ అనిపించుకున్నాను!" అని విఘ్నేశ్వరుడు చెప్పాడు.

శివుడు చిరునవ్వులు ఒలికించాడు. పార్వతి వినాయకుడి వింత చేష్టకు విసుక్కుంది. ఆ విధంగా వినాయకుడు విఘ్నాలు తెచ్చిపెట్టుకుంటూ వచ్చాడు.

పార్వతి మళ్ళీ మరొకసారి బలవంతపెట్టింది. "అమ్మా! ఏదైనా ఘనకార్యం చేస్తేనే గదా సమర్థుడనిపించుకుంటారు! నేనేదైనా చేసి తమ్ముడి లాగ ఘనుడనిపించుకోనిదే ఎలాగ పెళ్లిచేసుకోమంటావు?" అన్నాడు విఘ్నేశ్వరుడు.

"నీకేంతక్కువ నాయనా? సమర్థుడివికాక వాజమ్మవా ఏమిటి!" అందిపార్వతి.





# ఇద్దరు మోసగత్తెలు

## 7

మర్నాడు ఉదయం పాదరసం ఇల్లు చేరే సరికి అహ్మద్ ప్రాణాలు లేచివచ్చాయి. తన ప్రియశిష్యుడి జాడతెలియక అహ్మద్ కిందటి రాత్రి భోజనం చెయ్యలేదు. నిద్ర పోలేదు. తెల్లవారుతూనే భటుడొకణ్ణి పంపి తనసాటి కొత్వాలయిన హసన్‌ను కూడా పిలిపించి సలహా అడిగాడు. వాళ్ళు మాట్లాడుతుండగానే పాదరసం తిరిగి వచ్చాడు.

అతను తన అనుభవమంతా యిద్దరు కొత్వాలులకూ వివరంగా చెప్పాడు. హసన్ అంతా విని చిరునవ్వు నవ్వుతూ, "ఇంత పని చేయగల చిన్నది బగ్దాదులో ఒకతే వున్నది. అది పావురాల టపా నిర్వహించే దిలైలా కూతురు జీనాబ్. ఇంతకూ దాన్ని ఏం చేద్దామని నీ ఉద్దేశం?" అని పాదరసంఅలీని అడిగాడు.

"పెళ్ళాడదామని!" అన్నాడు పాదరసం చిన్నగా నవ్వి.

"ఇంతచేసినా కూడానా?" అన్నాడు హసన్ ఆశ్చర్యంగా.

"ఇంకా యింత చేసినా ఆ పిల్లను నేను క్షమించగలను: అది నాకు భార్య అయితే నాకు జీవితంలో యింకే కోరికా లేదు," అన్నాడు పాదరసం మన స్ఫూర్తిగా.

"అంత గాఢమైన కోరిక తీరకుండా ఉండరాదు. నువు కూడా మంచి అందగాడివి. మీకు జోడు సరిపోతుంది." అన్నాడు హసన్.

"మనవాడికి కాస్త సహాయం చెయ్యి, హసన్!" అని అహ్మద్ అడిగాడు.

హసన్ అప్పుడే పాదరసంఅలీకి ఒక పథకం తెలిపాడు.



పాదరసం తన శరీరమంతా నల్లరంగు పూసుకుని, నీగ్రోలాగా అంగవస్త్రం చుట్టుకున్నాడు. కొంత డబ్బూ, కొంత భంగూ తీసుకుని కూరల అంగడికి వెళ్ళాడు. అక్కడ అతను దిలైలా వంటవాణ్ణి వెతికి పట్టుకుని, "అన్నా, నేనీ నగరానికి కొత్త వాణ్ణి, సాటి నీగ్రోవు కనిపించావు. సారా దుకాణానికి వస్తావా? సఖ్యంగా తాగుదాం!" అన్నాడు నవ్వుతూ.

దిలైలా వంటవాడు, "నాకు క్షణం తీరిక లేదు. మా యింటికి రారాదా? అక్కడ నీకు కావలసిన అన్ని రకాల తాగుడూ, భోజనమూ కూడా పెడతాను," అన్నాడు.

పాదరసం కోరినది కూడా అదే. అతను ఆ నీగ్రోవాడి వెంట దిలైలా ఇంటికి వెళ్ళాడు. వంట ఇంట్లో చేరాడు. ఇంతలోనే దిలైలా, జీనాబ్ భోజనానికి వచ్చారు. వంటవాడు వారి భోజనమూ, తాగుడూ సిద్ధంచేసి ఒక్కొక్కటే తీసుకుపోయి వారి ముందు పెట్టసాగాడు. వాడు అవతలికి వెళ్ళినప్పుడు పాదరసం లోటాలలో భంగు కలిపాడు.

కొద్దిసేపట్లోనే దిలైలా, జీనాబ్, నలభై మంది నీగ్రోబానిసలూ, నీగ్రోవంటవాడూ, ఆఖరుకు వేటకుక్కలు సయితం భంగు ప్రభావంతో ఒళ్ళు తెలియకుండా వున్నచోటే పడిపోవటం తటస్థించింది.

పాదరసం యథేచ్ఛగా ఇల్లంతా తిరిగి, దిలైలా అధికారరీత్యా ధరించే దుస్తులూ, బంగారుటోపీ, నీగ్రోల ఎర్రజరీ దుస్తులూ పోగుచేసి మూటగట్టుకున్నాడు. మిద్దె మీదికి వెళ్ళి గూళ్ళలో ఉన్న పావురాలన్నిటినీ పెద్దపంజరంలో పెట్టుకున్నాడు. "ఈ పని చేసినవాడు వీరాధివీరుడు పాదరసంఅలీ తప్ప మరొకడు కాడు!" అని చీటీమీద రాసిపెట్టి, పావురాలూ, దుస్తులూ పట్టుకుని నేరుగా అహ్మద్ ఇంటికి వెళ్ళిపోయాడు.

దిలైలాకు ఒళ్ళు తెలిసేసరికి చీకటి పడుతున్నది. ఆమె పాదరసం పెట్టి

పోయిన చీటీ చూసుకున్నది. ఇల్లంతా కలయచూసి, అతను ఖలీఫాకు సంబంధించిన సొత్తుమాత్రమే సంగ్రహించాడని తెలుసుకున్నది. దిలైలా దీర్ఘంగాఆలోచించింది. ఈ సంగతి పైకిపొక్కితే తన పరువుకూ, ఉద్యోగానికీ కూడా భంగం. పాదరసం మీద పగసాధించుకున్నా ప్రయోజనంలేదు. అతని చేత అహ్మదే ఈ పని చేయించి ఉంటాడు. అతని కాళ్ళు పట్టుకుని పోయిన సొత్తు తెచ్చుకోవటం తప్ప గత్యంతరం లేదు. అహ్మద్ మీద పగ తీర్చుకోవటానికి గాను తాను తన కూతురి ద్వారా పాదరసంఅలీకి పరాభవం చేయిస్తే దానికి ప్రతిక్రియగా అహ్మద్ ఆ పాదరసం ద్వారానే పగ తీర్చుకున్నాడు. రెంటికీ సరిపోయింది. ఇక అహ్మద్ తనతో రాజీ పడవచ్చు. "ఇప్పుడే వస్తా," అని కూతురితో చెప్పి దిలైలా అహ్మద్ ఇంటికి వెళ్ళింది.

ఆమె అక్కడికి చేరేసరికి అహ్మద్, హసన్, పాదరసం అలీ మొదలైన వాళ్ళు కూచుని భోజనాలు చేస్తున్నారు. ఆమెను చూడగానే అహ్మద్, హసన్ లేచి తలలు వంచి సలాములుచేస్తూ, "దయచెయ్యండి, దిలైలా! మా పంక్తిన కూచోండి!" అని గౌరవంగా ఆహ్వానించారు.

వారు తింటున్నది పావురాయి మాంసమని తెలియగానే దిలైలాకు కళ్ళు చీకట్లు కమ్మాయి, తల తిరిగిపోయి నట్టయింది. ఆమె వణికిపోతున్న గొంతుతో





"అహ్మద్‌కు నా మీద ఎంత పగ ఉంటే మాత్రం ఖలీఫా ప్రాణప్రదంగా చూసుకునే టపా పావురాలను దొంగతనంగా తెప్పించి, వండించుకు తింటాడా? దొంగతనానికి మాత్రం నీతిలేదా?" అని అడిగింది.

"టపా పావురాలని తెలిస్తే వండుకు తినకపోదుమే!" అన్నాడు పాదరసం. అందరూ నవ్వారు.

హసన్ దిలైలాను అనునయిస్తూ, "నువ్వేమీ కంగారు పడకమ్మా! టపా పావురాలెక్కడికీ పోలేదు. ఖలీఫా సొత్తంతా సురక్షితంగానే ఉంది. ఒక్క చిన్న కోరిక, ఈ చిన్నవాడు కోరుతున్నాడు. దానికి నువు సరే నన్నట్టయితే నీ పావురాలూ, దుస్తులూ ఈ క్షణంలో నీ పరమవుతాయి!" అన్నాడు.

"ఆ కోరిక ఏమిటో చెప్పండి. నే నసహాయురాలినని మీకు మాత్రం తెలీదూ?" అన్నది దిలైలా.

"మరేమీ లేదు. ఈ కుర్రవాడు అలీ మీ అమ్మాయి జీనాబ్‌ను చేసుకోగోరుతున్నాడు." అన్నాడు హసన్.

"అయ్యో, నాయనా! దీనికా నన్నింత బాధించారు? నేను ఒప్పుకుని ఏం లాభం? మా జీనాబ్ ఒప్పుకున్నా లాభం లేదు. ఎందుకంటే దానికి వయసు వచ్చేదాకా రక్షకుడు దాని మేనమామ, మా పెద్దన్న జురేక్. ఆయన సరేనంటే గాని ఈ పెళ్ళి కాదు. మీకు తెలియనిదేముందీ? జురేక్ కట్టెనా కంపనా కాలని కర్కోటకుడు. ఆయన్ని ఒప్పించే భారం మటుకు పూర్తిగా పాదరసం అలీది!" అన్నది దిలైలా.

జురేక్‌ను కలుసుకుని, ఆయన అనుమతి సంపాదించి, ఆ తరవాతనే జీనాబ్‌ను పెళ్ళాడటానికి పాదరసం సిద్ధపడ్డాడు.

దిలైలా తన దుస్తులూ, పావురాలూ తీసుకుని వెళ్ళిపోయింది.

దిలైలా అన్న జురేక్ కూడా ఒకప్పుడు గొప్ప దొంగే. ఆ కాలంలో అతను చేసిన దొంగతనాలకు ఆచూకీ, దర్యాప్తూ, విచా

రణా అంటూ లేదు. అతను కూచున్న చోటు నుంచి కదలకుండా ఎక్కడ ఎప్పుడు ఏ దొంగతనం చెయ్యాలన్నా చేసేసేవాడు. ఇప్పుడు ముసలితనం వచ్చి, దొంగతనాలు మానేసి, చేపలు వేయించి అమ్ముకుని బతుకుతున్నాడు. కాని ఆ మనిషిలో ఇప్పటికీ ఎన్నో శక్తులున్నాయి.

జురేక్ తన దుకాణానికి జనాన్ని ఆకర్షించటాని కొక యుక్తి పన్నాడు. అతను తన దుకాణం వాకిలికి ఒక వెయ్యి దీనారాల సంచీ వేళ్ళాడగట్టి, దాన్ని ఎవరు ఎత్తుకు పోగలిగితే వాళ్ళు ఉంచుకోవచ్చునని చాటింపు వేశాడు. ఎట్లాగైనా దాన్ని కాజేద్దామని వేలసంఖ్యలో జనం దుకాణానికి వచ్చి సరుకుకొన్నారు. కాని ఆ సంచిని కాజెయ్యటం ఒక్కరివల్ల కూడా కాలేదు. ఏమంటే ఆ సంచిని ఎవరైనా తాకితే చాలు దుకాణం నిండా గంటలూ, డప్పులూ మోగుతాయి. అది వినగానే, జురేక్ దొడ్లో ఉన్నాసరే పరిగెత్తుకుంటూ వచ్చి దొంగను పట్టేస్తాడు, లేదా సీసంగుండ్లు దొంగలమీద విసురుతాడు. వాటి దెబ్బలకు కాళ్ళూ, చేతులూ విరుచుకున్న వాళ్ళు కూడా వున్నారు.

పాదరసం అలీ, జురేక్‌ను చూశాడు. తాను ఫలానా అనీ, కొత్వాల్ అహ్మద్ గారింట బస చేస్తున్నాననీ, తాను జీనాబ్‌ను పెళ్ళాడగోరుతున్నాననీ, పెళ్ళికి అనుమతించ వలసిందనీ కోరాడు. కాని ముసలి జురేక్ జీనాబ్‌తో పాదరసం పెళ్ళికి ఒప్పలేదు. అలీ, జీనాబ్‌కు తగినవాడు కాదని అతడనుకున్నాడు.

పాదరసం అలీకి, జురేక్ దీనారాల సంచీ కాజెయ్యాలనీ, దాని ద్వారా జురేక్ అనుమతి సంపాదించి జీనాబ్‌ను పెళ్ళాడాలనీ అనిపించింది. ఇందుకుగాను అతను గర్భిణీస్త్రీలాగా వేషం వేసుకుని జురేక్ వుండే దుకాణానికి వెళ్ళాడు. చేపలు బేరం చేస్తూ నొప్పులు వచ్చినట్టు నటించాడు. జురేక్ కంగారుపడి తన భార్యను పిలవటానికి లోపలికి వెళ్ళాడు.

—(ఇంకా వుంది)



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1981 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







P. Sundaram M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ జూలై నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకి పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26

---

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : రెంటికీ ఒకటే గూడు

రెండవ ఫోటో : చెల్లికి నేనే తోడు

పంపినవారు : టి. ఏ. భాస్కరరావు, చిలమత్తూరు. (చిత్తూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/–నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# లాలించండి

# మీరూ మురిసిపోండి

"అహా! మా నాన్నకి నేనంటే
ఎంతో యిష్టం. అందుకే మరి నాకోసం
రావల్‌గామ్ ఎక్లైర్స్ తెస్తాడు. కోకో,
కోకోనట్ రెండూను.
నాకు తెలుసు...నాన్న కూడా
దొంగలాగ చాటుగా తన కోసమూ
ఉంచుకుంటాడు కొన్ని."

కొత్తగా
కరకరగా,
చప్పరించేలాంటి
రుచితో

## Ravalgaon Eclairs






ఆకుపచ్చ
వెండి
నారింజ రంగు
వెండి
ఎరుపు
వెండి
పసుపుపచ్చ

# మోసానికి తావే లేదు!

## ఇప్పుడు అసలైన పాపిన్స్‌పై చుట్టబడే కాగితంపై వెండి చారలుంటాయి!

పిల్లలూ, ఏమిటో ఊహించండి మరి! ఇప్పుడు మోసగాళ్ళు మిమ్మల్ని మోసం చేయలేరిక. మీరు చేయవలసిందల్లా ఆకర్షణీయమైన పార్లే పాపిన్స్ ఫోయిల్ ప్యాక్ పైన వెండి చారలున్నాయా అన్నది చూడడమే. ఆతర్వాత పండ్ల రుచుల పాపిన్స్ నోట్లో వేసుకుని మురిసి పోవడమే సరేనా మరి ?




పార్లే
పాపిన్స్

నకిలీచేసే వాళ్ళు మిమ్మల్నిక మోసం చేయలేరిప్పుడు.

